# పీఠిక

పుట్టుక పుట్టిలో. నివాసము నీటిలో. కాని అరుణకాంతుల్లో, మందమారుతాల్లో, వికసితశతపత్రశోభతో వింత తావులను వెదజల్లుతుంది సరోజము.

ఆమె పుట్టినది బానిసదేశములో. బ్రతికినది పరాయి పరిపాలనలో. కాని పాలితులభాష నలవరచుకుని అసమాన పండితురాలైంది, కవయిత్రియైనది, మహావక్త అయినది. ఆమె కవితకు పాశ్చాత్యులచ్చెరువునొందారు. ఆమె ఉత్తేజకోపన్యాసములకు సమ్మోహితులయ్యారు. ఆమే సరోజిని.

**The rarely-gifted are failures in life.** అతితెలివిగలవారు జీవితములో ఎందుకూ పనికిరానివారౌతారు. అంత ప్రతిభావంతురాలైనా ఆమె జీవితము మాత్రము శతసహస్రవిధాల వికసించి, శోభాయమానమై వెలుగొందింది. **An whole era is crowded into her life-time.**

ఆమె దేశస్వాతంత్ర్యసమరములో పాల్గొన్నది. ముప్పదేడులు సాగిన పోరాటమది. కవితకు స్వస్తి చెప్పినది. జాతీయపతాకము నెగురవేసుకుంటూ, సేనానీమణియై దేశప్రజలను వీరపథాల నడిపించినది. **She preferred life to any transcription of it.**

శతాబ్దములనుండి స్త్రీజాతిమీద మన మొనర్చిన అన్యాయము అపారము. సరోజినీదేవి నాయుడు అనేకవిధాల గౌరవించి మనపాపకళంకమును మాపుకున్నాము.

ఆమెజీవితచరిత్రే గడచిన అర్ధశతాబ్ది యిండియాచరిత్ర. **She is the epitome of renascent India.**

ఆదర్శములేని జీవితము దీపములేని గృహమువంటిది. ప్రాక్పశ్చిమ సభ్యతా సమన్వయమే ఆమెఆశయము. బహుముఖ భారతీయ సభ్యతాసాంప్రదాయములను సర్వప్రపంచమునకు సుపరిచయము చేయడములోనే ఆమె డెబ్బదేండ్ల జీవితము గడిచిపోయినది. ఆమె కవిత, కలలు, వాక్కు, ప్రతిభ ఆ దివ్యకృషికే అంకితమైనవి.

సరోజినీదేవి జీవితమొక సముయఘట్టము. మాతృదేశదాస్యవిమోచన కల్పితమైన జీవితమది. స్వీయదేశీయులకు బానిసబ్రతుకు నుండి స్వతంత్రజీవితానికి వెలుగుమార్గములు చూపిన జీవితము. తనజాతీయులలో ఘనీభవించిన విభిన్నతను విస్మరింపజేసి, సఖ్యతను, సౌభ్రాతృత్వాన్ని, సామరస్యాన్ని పెంపొందించడానికి ప్రయత్నించిన జీవితము.

అందుకనే అన్నివిధాలా ధన్యజీవితమది. ఆ సాధ్వీమతల్లి జీవితచరిత్రే యిది, శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్య విరచితము.

జీవిత చరిత్రలను రచించటమొక కళ. ఈయన రచనావిధానములో ఒక విశిష్టత ఉన్నది. జీవిత ఘట్టాలను పరిచయముచేస్తాడు. సంఘటనలను వర్ణిస్తాడు. విషయములను విశదపరుస్తాడు. వాటిపై ఇతరుల అభిప్రాయాలను యెరుకపరుస్తాడు. కానితాను మాత్రము ఎక్కడావ్యాఖ్యానముచేయడు. కవిత్వము సౌందర్యానికి రూపురేఖలను దిద్దుతుంది. కానివ్యాఖ్యానముచేయదు. అందుకని యీ రచయితను చరిత్రకారుడు అనడముకంటే కవి అనడము సమంజసము. అందువల్లనే నేమో ఈ రచన చదవటానికతిరమ్యముగానున్నది.

సరోజినీదేవి వాగమృతమును గ్రోలాము. సాగరగంభీరతను ధిక్కరించు ఆమె వాక్కు మనమానససీమలో నయాగరాజలపాతమువలె ప్రతిధ్వనిస్తూనే వుంటుంది. ఆమె కవిత మనజీవితాల నానందమయమొనర్చినది. ఆమెసమకాలికులమై పుట్టడమువల్లనే మనకాపుణ్యమబ్బినది.

కాని భావిసంతతుల వారికాభాగ్యములేదు. ఒకప్రసిద్ధ విదుషీమణిగా, ప్రబుద్ధ భారతనిర్మాతగా, ప్రపంచ ప్రశంసలపొందిన మహావక్త్రిగా, భారత యితిహాసములో ఆమె చరిత్రనుమాత్రము చదువుతారు.

అలాంటివారి కీరచన యెంతైనా ఉపకరిస్తుంది. ఆమె జీవితరూపమును కళ్ళకుకట్టినట్లుగా ప్రదర్శిస్తుంది. ఆంధ్రబాలికలు వీరవనితల, విదుషీమణులచరిత్రలను పఠించాలి. వారి పద్ధతులనే తమజీవితాలను తీర్చిదిద్దుకొనుట వాంఛనీయము. ఈ పుస్తకము అందులకే ప్రతి బాలికా పాఠశాలలలోను పఠనీయగ్రంథముగా ప్రభుత్వమేర్పరచదగునని నా సలహా.

వసంతాగమనాన్ని చెప్పడానికే కోయిలవస్తుంది. వసంతఋతువును రాగరంజితము చేస్తుంది కోయిల కూజితము. వసంతాంతముతో యెక్కడికో ఎగిరిపోతుందాకోయిల.

సరోజినీదేవిని 'ప్రాచ్యదేశపుకోయిల'ని పాశ్చాత్యులు గౌరవించేవారు. అందులో యెంతో అర్థమున్నది. మృత్యువు ఆహ్వానాన్నందుకుని, మరోలోకానికేగింది ఆమె. One shares love and fun with others but not sorrow.

1 మే 1949,<br>
విజయవాడ.

సోమనాథ వెల్లటూరు

# అభిప్రాయములు

## I

ప్రశాంతమైన గంగానదీ హృదయంనుంచి కదిలి కదలొరిసే అమృత తరంగంలా, ఒకజాతి జీవితంనుంచీ, ఒకజాతి హృదయంనుంచీ లేచివచ్చిన సంచలనమే సరోజినీదేవి వాక్కున సంగీతమైంది, కవిత్వమైంది. హిమాలయోన్నతమైన మన పురాసంస్కృతి హిమాలయంలో గడ్డకట్టుకుపోతూ, ప్రజాహృదయాన్ని వదలి శిలాఫలకాల్ని ఆశ్రయించుకున్న దుర్దినాన జాతిజాగృతికి ఒక చైతన్యకిరణం ప్రసారించిన రవీంద్రమహాకవిలో ఒకఅంశం పంచుకున్నది సరోజినీదేవి. మోదుగుపూతలు పచ్చబాగి కెంజిగుళ్ళతో వసంతోత్సవంలో మెరుస్తున్నప్పుడు, కింద నేలమీద గడ్డిపూలు పచ్చగా, ఎర్రగా విచ్చుకుంటున్నప్పుడు—ఒక రాజా రామమోహనరాయి, ఒక రవీంద్రుడు, ఒక గాంధీ జాతి హృదయాన్ని అధిష్ఠించినప్పుడు—సరోజినీదేవి ప్రకృతిని గానంచేసింది; జాతిప్రకృతిని గానంచేసింది.

భారతస్వాతంత్ర్యోద్యమంతోను, అభ్యుదయ సాహిత్యోద్యమంతోను, ఇతర అభ్యుదయోద్యమాలతోను ఆమెసన్నిహితత్వమే ఆమెను ప్రజలకు సన్నిహితంచేసింది. ఈనాడు సరోజిని ఒకసంగీతంగా భారతజాతికంఠంలో ప్రతిధ్వనిస్తున్నది. నానాటికీ పెంపొందుతున్న ప్రజోద్యమాలకూ, ప్రజాచైతన్యానికీ దారిచూపుతున్నది.

'సరోజినీదేవి' అనే ఈ గ్రంథం ఆమెజీవితంలోని అనేక కళామయ ఘట్టాలను కళ్ళకుకడుతున్నది. జీవితచిత్రణలో ప్రత్యేకం అభిజాత్యంగల శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు దీన్ని వ్రాయటంలో నిజంగా ఔచిత్యం స్ఫురిస్తుంది.

—ప్రయాగ

## II

దివంగత సరోజినీదేవి భారతనారీలోకమునకు వన్నెతెచ్చిన మహిళా రత్నము. కాంగ్రెసు నాయకవర్గములో నుత్తమ స్థానమునాక్రమించుకొన్న యీ వీరాంగన, స్వతంత్రభారతావతరణమునకై కావించిన సేవ, ప్రకటించిన త్యాగము, ప్రదర్శించిన యుదాత్తత దేశభక్తులపాలిటి మేలుబంతులు.

చిరస్మరణీయమైన యీమె చరిత్రను రమణీయముగా రచించి యాంధ్రీకరించిన శ్రీ గొఱ్ఱెపాటి వెంకటసుబ్బయ్యగారు ధన్యులు. వీరుచరిత్రరచనలో నింతకుమున్నె పేరుమిగిలినవారు. వీరిపలుకులలో జీవము తొణికిసలాడుచుండును. వీరివలె వ్యావహారిక భాషాసౌందర్యము నెఱింగినవారు, ప్రయోగింపగలవారు నేటి తెలుగురచయితలలో నెందఱో లేరు. తెలుగునుడికారపుసొంపు పల్లెటూరిలో బుట్టిపెరిగినవారికే తెలియును. భావుకులే కాక జానపదులునగుటచే శ్రీ గొఱ్ఱెపాటివారు మనకిట్టి కమ్మకమ్మని విందులు సేయగలుగుచున్నారు. తెలుగుజాతి వీరికెంతో ఋణపడియున్నది.

—తుమ్మల సీతారామమూర్తి

## III

సర్వప్రియ, సర్వమంగళప్రదాయిని, సర్వజనమాతృమూర్తి సరోజినీదేవి. సిరిసంపత్తులకూ, విద్యావిజ్ఞానములకు లక్ష్మీసరస్వతులు అధిదేవతలంటారు. అయితే, సరోజినీదేవి స్వాతంత్ర్య సౌభాగ్యము, సర్వతోముఖసంస్కృతి, ఈరెంటికీ, అధిదేవత అనుటలో అతిశయోక్తిలేదు. లక్ష్మీసరస్వతులు సరోజ పుష్పంలో ఉద్భవించినట్లు కవివర్ణించాడు, చిత్రకారుడు చిత్రించాడు. అంచేతనే, భారతదేశమునకు చిహ్నం సరోజపుష్పం. మన సరోజినీ సార్థకనామధేయురాలు. ఈ వీరబాల, వీరయువతి, వీరపత్ని, వీరమాత, వీరరత్నం, భారతమాత మకుటంలో ఆచంద్రార్కంగా దేదీప్యమానంతో ప్రజ్వలిస్తుంది. భారతదేశమందేగాక, ప్రపంచమందంతటను సాటిలేని ఈ మహిళామణి పవిత్ర చరిత్రను రచించి శ్రీ గొ॥ వెంకట సుబ్బయ్యగారు చరితార్థులయినారు.

ఈ మాతృమూర్తికీ, ఆమెకోటానుకోట్ల బిడ్డలలో నొకతెనగునాకూ, చిరకాలపరిచయము, కొంతసన్నిహితసంబంధమూ వుండినందుకు మురిసిపోతు

న్నాను. మహిళోద్యమం, జాతీయోద్యమం, హరిజన సేవకసంఘములలో పని చేయు కాలంలో ఈ అమూల్యరత్నమునకూ, నాకూ, తల్లిపిల్లల సంబంధం ఏర్పడింది. నాకు సర్వవిధాల ఉత్తేజమిస్తూ అత్యంత అనురాగ ఆదరణములతో మన్నించిన నామాతృమూర్తి చరిత్రను చదువుతుండగా, ఒకప్రక్క భక్తిప్రేమలు, మరొక ప్రక్క తల్లిని కోలుపోయిన మహావిషాదము పొంగిపోతున్నవి. కాని, మన అజ్ఞానమును కొంతతొలగించితే ఆమె మన హృదయపీఠంలో సర్వకాల పర్యావస్థలలో ఆసీనురాలయి ఉండుట గోచరిస్తుంది.

ఈ నారీరత్నము జనించిన వంశం, జననీ జనకులు, పెరిగినవాతావరణం, బాల్యంలోనే ఆమెకున్న కవితాశక్తి, ప్రతిభావిశేషం, ప్రత్యేకత, వీటిని రచయిత చక్కగా చిత్రించారు. 16 ఏళ్ళముగ్ధగా వున్నప్పుడే, విజ్ఞానవేత్త, విమల చరితుడైన వరుని వరించింది. నిరోధించినను ఆమె ఆ మహాపురుషునే పెండ్లియాడ ప్రతినబూనింది. మూడేళ్ళపర్యంతం విజ్ఞానసంపాదననిమిత్తం విదేశపర్యటనము కావించి, తిరిగి వచ్చింది. తాను వరించిన భర్తనే పెండ్లియాడి, తన ప్రతిన నెరవేర్చుకొన్నది. ఈ విషయాల్ని విపులంగా వ్రాశారు.

ఇక ఈ ఆదర్శగృహిణియొక్క కుటుంబజీవితాన్ని బహుచక్కగ వర్ణించారు. భర్తకు, పిల్లలకు, బంధుమిత్రులకు, అత్యంత శ్రద్ధాప్రేమలతో విద్యావిజ్ఞానములతో, సేవచేసింది. బంధుమిత్రులకు, అతిథిఅభ్యాగతులకు, అత్యంత అనురాగంతో ఆదరిస్తూ, స్వయంగా వివిధవంటకములను వండి వడ్డించేది. ఈ కవయిత్రికి కళలలో భిన్నరుచులున్నట్లే, పాకకళలో కూడ వివిధరుచులున్న కళావేత్త, సాటిలేని ఇల్లాలు అనే విషయాన్ని బహుబాగ వర్ణించారు.

ఇక ఈ వీరాంగన మూర్తి విషయం—గంభీరమైనమూర్తి. గుణసంపద, ప్రతిభాప్రేమలు, కవితాశక్తి, లలితకళలు మున్నగు అంతర్యాశక్తులు ఆ మూర్తిలో ఎలా ప్రతిబింబించేవో బహుచక్కగ వర్ణించారు. ఆమె కట్టు, బొట్టు, మాట, నడక, వేయేందుకు, ప్రతిప్రవర్తనలోనున్న విశిష్టతను చక్కగా చూపెట్టారు.

ఈ మాతృమూర్తి స్వకుటుంబ నిర్వహణతో పాటు, మెల్లమెల్లన భారతమాత కుటుంబాన్నే నిర్వహించ ప్రారంభించింది. శ్రీ గోఖలేగారితో సహా ప్రజాహితసంస్థలలో పాల్గొనసాగింది. మహిళోద్యమమునకు మాతృ

మూర్తియై పాటుపడజొచ్చింది. వలసపోయిన భారతపుత్రికాపుత్రుల అష్టకష్టములనుండి రక్షించ ఖండఖండాంతరములు తిరిగింది. వక్తృత్వము, కవిత్వము, ప్రతిభావిశేషము మొదలగు తన వివిధశక్తులను వినియోగించి కాపాడ సమకట్టింది. ఇంతలో మాతృదేశంలో, స్వాతంత్ర్యసిద్ధికై, మహత్తరమైన జాతీయోద్యమం బయలుదేరింది. వెనువెంటనే, జాతిజనకుడు గాంధీజీకి ప్రియశిష్యురాలై, సర్వస్వము త్యజించి, స్వాతంత్ర్య సమరంలో దూకింది. హిందూ ముస్లిము ఐక్యతకు అహర్నిశలు పాటుపడి, వీరిద్దరి హృదయాల్లో గౌరవ స్థానాన్ని పొందింది. ఈ వివరములను చాలచక్కగా చిత్రించారు.

పుట్టుకతోనే పరిమళము, అందచందాలతో బయలుదేరిన మన సరోజ పుష్పం, గాంధీజీసాన్నిధ్యముచే, పరిపూర్తిగా వికసించి, ఒక్కసారిగా తన తావిని వెదజల్లింది. జాతిజనకుడు, తనపరమగురువు అయిన గాంధీజీకి, ఇంటా బయటా, చెరసాలలలో తోడునీడై, ప్రక్కబలంగావుండినది. తన సహజ పరిహాసముతో, చాతుర్యసంభాషణలతో, పవిత్రప్రేమతో, ప్రతిభావిశేషముతో, కవితా ధోరణితో, తన గురువును అనుక్షణం ఆనందింపజేస్తూ, ఆదరిస్తూ, లాలిస్తూవుండేది. ఈవిషయాలను గొర్రెపాటివారు తమసహజమైన భాషాలాలిత్యముతో ఉదాత్తంగా వర్ణించారు.

మరొకవిశేషం. సరోజినీ జీవితవాహిని, స్వాతంత్ర్యోద్యమ సాగరంలో ఎలావిలీనమై పోయిందీ, వాటిరెంటినీ ఎలావిడదీయనశక్యం అనే విషయాలను, స్వాతంత్ర్య సమరంలోనూ, స్వాతంత్ర్య సిద్ధిఅనంతరమూ ముఖ్య ఘట్టాలను చిత్రిస్తూ ఎలా ఈవీరరమణి తనపాత్రను నిర్వహిస్తూవచ్చింది అనేవిషయాల్ని మనకళ్ళఎదుట జరుగుతున్నట్లు వెంకటసుబ్బయ్యగారు చిత్రించారు. అంతేగాదు. తనపరమగురువు జీవితంలో లీనమైన ఈ ప్రియశిష్యురాలు, తన ధర్మాన్ని నెరవేర్చి ఒకఏడాదిలోపల తనగురుదేవునిసాన్నిధ్యం చేరుకుందో స్పష్టంగా చూపెట్టారు.

మన సరోజిని, మన మాతృమూర్తి చరిత్రను ఆదినుండి అంతంవరకు చదువుతుంటే, సంగీతంలాగు మెట్టునుండిమెట్టుకు ఆరోహణచేస్తూ, చివరకు వర్ణింపనశక్యమైన ఆనందాన్ని పొంగులాగున ఉంటుంది.

వేమనుకు? శ్రీ వెంకటసుబ్బయ్యగారు పరమపావనమైన మన మాతృదేశచరిత్రను వ్రాసి భారతజాతికే అమూల్యమైన సేవచేశారు. అందులో ముఖ్యంగా, ఈపవిత్రచరిత్రను ఆంధ్రమహిళల హస్తమున పెట్టి, అనవరతము, మాతృమూర్తి గుణగణములను జపించుకొనేలాగున చేశారు. అందుచేత, ఆంధ్రనారీలోకం తరఫున సోదరుడు శ్రీ వెంకటసుబ్బయ్యగారికి హృదయపూర్వకమైన కృతజ్ఞతాభివందనములను అర్పిస్తాను.

—దరిశి సుభద్రమ్మ

## IV

శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు రచించిన సరోజినీదేవి జీవితం ఆసాంతంగా చదివాను. జాతి పురోభివృద్ధికి జీవితరచనల ఉపయోగం యెంతయో కలదు. అయినను మన తెలుగు కవులు మహనీయుల చరిత్రలు వ్రాయుటలో తగినంత శ్రద్ధ చూపినట్లు కాన్పించదు.

ఈ కవి చరిత్రరచనలో అందెవేసినచెయ్యి. ఈయన పోకడయు ఏనూత్నపంథాలో నడుస్తుంది. కట్టె, కొట్టె, తెచ్చె అన్నట్లుగా జీవిత లెక్కలతో సరిపెట్టటం వెంకటసుబ్బయ్యగారికి గిట్టని విషయం. జీవితచరిత్ర వ్రాయబడేవ్యక్తియొక్క సమకాలీన చరిత్రను కొంత పొందుపరచిననేగాని ఆయనకు తృప్తిలేదు. ఆనాటి దేశచరిత్ర తప్పక వ్యక్తులమీద తనప్రభావం వేసితీరుతుందనే చిరసత్యమే కవి యీభావనకు కారణం. ఈ ధోరణిలోనే ఆయనగారు రచించిన "ఆచార్యరంగా", "మన రైతుపెద్ద" మొదలైన గ్రంథాలు నడిచినవి.

భారతదేశానికి ఆయువుపట్టయిన పల్లెటూరునందు జన్మించుట చేతనో లేక జాతికి వెన్నెముక అయిన రైతుబిడ్డగా రాణించుటవల్లనో యేమో కాని యీ కవి సాహిత్య క్షేత్రములోగూడ అట్టి రచనలనే ఎంచుకున్నారు. ఘంటసాల చరిత్రలో చరిత్ర నిదర్శనములతో పాటు గ్రామాల ఔన్నత్యాన్ని చక్కగా చిత్రించి పాఠకులదృష్టిని గ్రామాలవైపుకు ఆకర్షించారు. రైతునాయకుల (రంగా, బ్రహ్మయ్యగారల) జీవితచరిత్రలద్వారా భారత రైతాంగానికి ఒక నూతనోత్సాహాన్ని కల్పించి రైతుబిడ్డగా తనవిధ్యుక్తధర్మాన్ని నిర్వర్తించారు. "ప్రజానాయకుడు ప్రకాశం" అను పుస్తకం ప్రజాస్వామ్యపు రోజులకు తగినవ్రాత. వారి బాలవాఙ్మయాభిరుచికి "నవ్వులు-పువ్వులు." నిదర్శనం. ఈవి

ఖంగా నాటిసృష్టి సర్వతోముఖముగా ప్రసరించినది. పోతే యాంత్రిక జీవితాను నిర్వ ర్తిన పని ఆనండి లేక లోపమనండి ఒకటే. అది మాతృస్థానంపైన దృష్టిని సారించకపోవుటయే. భారతమహిళల అభిమానపాత్ర సరోజినీదేవి జీవితచరిత్ర వ్రాయుటతో ఆ కర్తవ్యాన్నిసహితం నెరవేర్చగల్గారు.

నా పైతృపోద్ఘాతమంతా జాతికి పునాది అయిన మాతల పురోభివృద్ధిని కాంక్షించే రచనలు యెక్కువగా వెలువడవలెనని స్పష్టీకరించుటకే. ఇది అట్టి రచనలకు నాందీప్రస్తావన.

సరోజినీదేవి వివిధకళలను, పలువిధ రంగాలను ఆయా సందర్భాలతో, పలువిధ అభిప్రాయాలతో కవి చక్కగా ఎత్తిచూపారు. అల్లర్లపాలులలోని పంజాబుమహంతాల ఉపన్యాసాల సందర్భములో జరిగిన ఆలజడికి పరాయిదేశ మనిషనుకూడ తలంచక రౌద్రమూర్తియై "నోరుమూయండి" అని గర్జించిన ఆమె నిర్భయతను, కవికోకిలగా ఆమె మృదుమధుర సాహిత్యాన్ని, దేశభక్తురాలుగా ఆమె త్యాగం, జీవితాంతంవరకు గల ఆమె అకుంఠిత దేశసేవాదీక్షను, ఆసియామహాసభలకు నాయకత్వం, భారతమహిళల తరఫున అంతర్జాతీయ ప్రాతినిధ్యం, మొదలైన వివిధ ఘట్టాలు వర్ణించబడినాయి. కాని కవి తృప్తిపడ గలిగినది 'గాంధీజీ జాతిజనకుడైతే సరోజినీదేవి మన మాతృదేవత' అనేవాక్యం లోనే. స్త్రీలవిజ్ఞానాభివృద్ధియందు తనకు యెంత అపేక్షయున్నదో నవీన విద్యావతులైన కొందరి విపరీత "ఫాషన్సు" అంటే అంతే వ్యతిరేకత కూడా కన్పించినది. "కేవలం పౌడరు పూతలతో తమముఖాలకు అందాలు తెచ్చుకో ప్రయత్నించే యీ సీతాకోకచిలుకల్లో నుంచికూడ, కొన్ని నిప్పురవ్వలను ప్రజ్వలింపజేయగలిగినందుకు ఆమెనెంతయినా అభినందించాలి" అని సరోజినీ దేవి గొప్పతనాన్ని గురించి వ్రాసినవాక్యమే యిందుకు కారణం. కవిపాశ్చాత్య విద్యలో ప్రాచ్యసాంప్రదాయంగానే సరోజినీదేవి ప్రజ్ఞను చూచి మురిసి పోయారు.

ఆమె కార్యరంగాన్ని కవి విశాలప్రపంచదృష్టితో పరికించటం ఒక విశేషం. సర్వప్రియసరోజినిని ఎ ఇండియావారికో, ఆసియావాసికో కుంచించటం ఆయనకు ఇష్టంలేనట్లు పంక్తులకు స్పష్టంగాద్యోతకమౌతూన్నది. భారతనారీ శిరోమణికి కల్పించిన సముచితస్థానానికి కవికి ఇవే నాఅభివందనాలు.

—సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవి

# విన్నపము

"Poets and patriots-Nota Bene!
We ' ve only had one Sarojini
Her works are many - but few know 'em
So well as her life-itself a lyric poem!"

పురుషప్రపంచములో కరుణామూర్తియగు బుద్ధుడు మినహా మహాత్మునియుంచిన చారిత్రక పురుషులు మనదేశములోలేరు. మహిళా లోకములో సరోజినీదేవితో సరితూగువారు లేరనుట అతిశయోక్తికాదు.

సరోజినీ గాంధీజీకి సన్నిహిత శిష్యురాలు. గాంధీజీ ఆత్మకథ ద్వారా నిరంతర సాధనవల్ల ఆయన మహాత్ముడైనట్లు మనముగ్రహించగలము, కాని సరోజినీదేవి సాధనాబలమువల్ల అభివృద్ధిగాంచినట్లు కన్పించదు. ఆమెకో వికాసము యెప్పుడుకలిగినదో, ఎటులకలిగినదో, చెప్పగలిగినవారులేరు. ఆమె మహాత్మునివలె ఆత్మకథ రచించనూలేదు.

సకల సంస్కృతులు ఆమెలో సమ్మేళనమొందినవి. ఆమెలో ఈ లోపమున్నదని చెప్పినవారుకాని, చెప్పగలిగినవారుకాని లేరు. ఆమె ప్రతిభ, హృదయమైశాల్యము అనన్యము. ఆమెలో లోపాలు లేనట్లే ఆమె కూడా ఎవరిలోపాలను వెతికి వెలువరించలేదు. అందరియెడల ఆమెకు సమభావమే. అందరినీ ఆదరించి అభిమానించింది. కన్నతల్లివలె ప్రేమతో చూచినది. హెచ్చుతగ్గులు, సంకుచితత్వము, ద్వేషము, అసూయ, ఆమెలో ఈషణ్మాత్రములేవు. ఆమె అందరినీ ప్రేమించినట్లే అందరి ఆదరగౌరవప్రేమలకు పాత్రురాలైనది. నెహ్రూగారన్నట్లు, ఆమె "సర్వ ప్రియ" కాగలిగినది.

ప్రపంచం ఆమెను ప్రప్రథమముగా కవయిత్రిగా గుర్తించినది. కవిత్వమువల్లనే ఆమె ప్రపంచఖ్యాతిగాంచినది. వక్తగాకూడా ఆమె అట్టి ప్రఖ్యాతినేపొందినది. ఆమెకోకిలకంఠానికందరూ ఆనందంపొందారుకాని, ఆమెగొప్పతనము గ్రహించినవారు ఎందరున్నారో చెప్పలేము.

ఏమానవుడూ ఇంతవరకు సర్వప్రియత్వము గాంచినట్లు గన్పిం చదు. సరోజినీ జీవితకాలములోనే సంపాదించినది. దీనికి కారణమేమి? ఆమెసంభాషణాచాతుర్యమా? పరిహాసకుశలతా? కోకిలకంఠమా? మాతృప్రేమయా? సంపూర్ణమానవత్వమా? ఏది ఆమెను అందరిప్రేమకు పాత్రురాలను చేసినది?

గాంధీజీ సాధనాబలమువల్ల సంపాదించిన గొప్పతనము మన మందరమెరిగినదే. ఆయనలో అంతర్వాహినిగా పూర్వజన్మ సంస్కారము వున్నదేమో చెప్పలేము. మనకు కన్పించునది ఆయన సాధనా సంపత్తే. సరోజినీ అట్టి సాధనాసంపత్తిలేకనే సర్వప్రియత్వముపొందినది.

ఇందుకు కారణము ఆమెపూర్వపుణ్యవిశేషమో జన్మజన్మాంతర సంస్కారమో, పిత్రియసంపత్తో, వంశవారసత్వమో, యేదోఇదమిద్ధముగా చెప్పలేము.

దీర్ఘముగా ఆలోచించిన ఆమెను అసలు ఒకవ్యక్తిగా, మానవ మాత్రురాలుగా భావించలేము. ఆమె ఒక మధురప్రవాహము. ఒక అక్షయ సౌందర్యరాశి. ఆనందస్రోతస్విని, ప్రేమమూర్తి, మాతృదేవత. ఆమె భౌతికంగా వృద్ధాప్యము పొందిననూ, జీవితాంతంవరకు ఆమె ప్రేమ తత్వము నవనవోన్మేషణముగానే వుండెను.

> "Tho' you deny the hope of all my being,
> Betray my love, my sweetest dream destroy;
> Yet will I stake my individual sorrow,
> At the deep source of universal joy,
> O Fate! in vain you hanker to control,
> My frail, serene, indomitable soul."

"సంపూర్ణ ఆశాజీవనకాంక్షలనుండి నీవునన్ను వంచించినప్పటికీ, నాప్రేమను విచ్ఛిన్నముచేసి, నామధురస్వప్నాలను భగ్నముచేసినప్పటికీ,—ఏమైనప్పటికీ నావ్యక్తిగత విషాదమును విశ్వానంద గంభీరజలధి గర్భాంతరాళమున ముంచివైచెదను. ఓవిధీ! పరిక్షీణమైనను, శాంతియు

త్రము, అజేయము అయిన నాఆత్మపై ప్రభుత్వము కొనసాగించుకొను టకు వ్యర్థముగా ఆయాసపడుచున్నావు ”

పైనపేర్కొనిన ఆమెగీతమున కనుగుణ్యముగా ఆమెజీవితం గడిపినది. ఆమెరచనవేరు, జీవితమువేరు కాదు. దుఃఖవిషాదభరిత ప్రపంచములో ఆమె సంచరించినను “నీవు నాఆత్మను ఏవిధంగానూ, జయించలేవు”అని విధితో సంపూర్ణవిశ్వాసముతో ఆమె పలికినది. ఆవిధం గానే ఆమె అజేయమై, ఆనందముగా ఆఖరువరకు జీవించినది.

ఈ ఆనందప్రవాహము ఎట్టిది? విశ్వానందములో స్వీయాను భూతులు లీనమొనర్చుటే. ఆత్మార్పణము ప్రేమానందాలకు మూలసూత్ర ము. స్త్రీలు యుగయుగాలనుండీ ఈరహస్యాన్ని యెరిగియేయున్నారు. సరోజినీదేవిలో అనుక్షణము ఆస్త్రీస్వభావాన్నే చూచాము. ఆమెజీవిత మంతా త్యాగభూయిష్టమైనదే. ఆత్మార్పణానుగుణ్యమైనదే. ఆమె విశ్వ జననిగా విలసిల్లినది. స్వీయసంతానమునకై సమస్తము, సంతోషముగా అర్పించి, ఆనందముపొందినది. తాను ఆనందము పొందుటేకాదు, ఇత రులనుకూడా ఆనందింపజేసినది.

ఇట్టి మహనీయురాలిచరిత్ర రచించుభాగ్యము గలిగినందుకు ఆనంద పడుచున్నాను. ఆతల్లియందుండే ఆదరముతప్ప ఈగ్రంథరచనకు మరొక విధంగా నాకు అర్హతలేదు.

మననాయకులను గురించి, అనేకులు అనేకగ్రంథాలను వ్రాశారు. కాని సరోజినీదేవినిగురించి వ్రాసినగ్రంథము మన తెలుగులోవున్నట్లుగా నాకు తెలియరాలేదు. ఆలోపము పూర్తిచేయుటకే పూనుకొన్నాను. ఎంత వరకు ఆమెను యథార్థముగా చిత్రించగలిగితినో, ఎంతవరకు మనో హరంగా రచించగలిగితినో, చెప్పజాలను. అయినను నాప్రయత్నము వుత్తమచరిత్ర రచనకు మార్గమైనా కాకపోవునా అని విశ్వసించుచున్నాను.

పాల్కురికి సోమనాధుడు బ్రతికివున్నమానవుని ఆరాధించండి అని చేసిన వుద్బోధన ఆంధ్రజాతికి కొంతవరకు ప్రాణముపోసినది, వీర

వ్రతముపూనిరి. మనలో సోమనాథునివలె, ఆంగ్లేయులలో "కార్లయిల్" వీరారాధనావశ్యకతను గుర్తించి, గుర్తింపజేసినాడు. వారియిరువురు గొప్ప వీరారాధకులేగాక, వీరజీవితచరిత్రకర్తలు. వారిమహదాకాంక్షే నన్నుఆవేశభరితున్నిగాజేసింది. వారి ఆదర్శాలే నాలో వీరారాధనతత్పరత గలిగించి జీవితచరిత్ర రచనకు పురికొల్పినవి.

వీరపూజ దేశౌన్నత్యానికీ, జాతిమహత్వానికీ, అవశ్యకమైనపవిత్రానుష్ఠానము. అందుచేతనే "జాతి తనవీరుల ఆరాధనవల్లనే జీవించును" అన్నినానుడిపుట్టినది. అట్టివీరారాధనకు వారిచరిత్ర రచనకంటే అధికమైనదేదిగలదు? అట్టికార్యాన్ని క్రమబద్ధముగాజేసి కృతార్థులమవుదుముగాక!

ఈ గ్రంథరచనకు శ్రీమతి సరోజినీ నాయుడు, 'హమారేనేతా ఔర్ నిర్మాతా' అనే హిందీగ్రంథాలు వుపయోగపడినవి. ఆ గ్రంథకర్తలకెంతయు కృతజ్ఞుడను.

ఈగ్రంథానికి పీఠికవ్రాసిన శ్రీ సోమనాథ వెల్లటూరుగారికిన్ని, దీనిపై తమ అభిప్రాయములు పంపిన సోదరసోదరీమణులకునూ, కృతజ్ఞతావందనములు.

ఘంటసాల<br>
16—5—49

గొర్రెపాటి వెంకటసుబ్బయ్య

—:o:—

హాలము కలము చేబట్టి నవధాన్యాలూ, నవ
రసములు అర్పించిన అమరకవి కవికోకిల
దువ్వూరి రామిరెడ్డిగారి దివ్యస్మృతికి

# విషయసూచిక




1 పరిచయము 1

2 వంశవృత్తాంతము 10

3 విద్యాభ్యాసము - కవితాంకురము 15

4 కావ్యార్చన 18

5 వక్తృత్వము 28

6 యువజనులపై ప్రేమ - ప్రభావము 33

7 కుటుంబజీవితము 35

8 గుణశీలస్వభావాదులు 41

9 మహిళాసేవ 46

10 ఐక్యతాకృషి 50

11 వలసభారతీయులసేవ 54

12 కాంగ్రెసులోకృషి 58

13 బాపూజీతో.... 65

14 స్వాతంత్ర్యసమరంలో.... 75

15 ఆంధ్రస్త్రీలకు సందేశము 81

16 ప్రాచ్యపరిషత్తులో ప్రవచనము 85

17 గవర్నరు 92

18 మహాప్రస్థానము 99

19 శ్రద్ధాంజలి 106

20 జీవిత తత్త్వము 115



సరోజిని
లండన్ లో
విద్యార్థినిగా



జాతీయ
కాంగ్రెసు
అధ్యక్షు
రాలుగా

# పరిచయము

"చదువ న్నేర్తురు స్త్రీలు పూరుషుబలెఁ
శాస్త్రంబుల్ పఠింపించుచోఁ
దునుమ న్నేర్తురు శత్రుసేనల
ధనుర్వ్యాపారముల్ నేర్పుచోఁ
ముదితోత్సాహముతోడ నేలఁగల
రీ యుర్వీఁ బ్రతిష్ఠించుచోఁ
ముదితల్ నేర్వఁగరాని విద్య గలదే
ముద్దార నేర్పించినన్"

—చిలకమర్తి

భరతఖండమున పురుషులలో కవులు, గాయకులు, యోగులు, తత్వవేత్తలు, భక్తులు, వీరులు, మొదలగువారు ఉద్భవించినటులనే స్త్రీలలోను జన్మించిరి. మన వేదపురాణేతి హాసములనుండి, ఇందులకనేక నిదర్శనములున్నవి.

ఋగ్వేదమునందు విదుషీమణులుగా అనేక స్త్రీలు పేర్కొనబడిరి. గార్గి, మైత్రేయి, ఘోషాదేవి, వాగ్దేవి, లోపాముద్ర, మమత, అపాల, సూర్య, ఇంద్రాణీ, విశ్వవీర, శశి, మొదలగువారెందరో కలరు. వీరిలో కొందరు కొన్ని ఋక్కులను రచించిరి. మరికొందరు, తపస్వినులు. అందులో గార్గి మైత్రేయుల, దార్శనికజ్ఞానము, వాగ్దేవియొక్క అద్వైతసిద్ధి, ఆత్రేయియొక్క శిక్షోపటుత్వము, ఘోషాదేవి

రయొక్క ఘోరతపస్సు, విశ్వవీరయొక్క సూక్తిసుధ, గమనార్హములు.

అటులనే మధ్యయుగమున అనేక విదుషీమణులు అవతరించిరి. భారతీదేవియొక్క సమగ్రవిద్యాప్రపూర్తి, లీలావతియొక్క గణితశాస్త్రనిపుణత, ఖానాయొక్క జ్యోతిషవిద్యాప్రతిభ, సంగమిత్రయొక్క అపూర్వధర్మోద్ధరణాశక్తి, హరివిద్యాలంకారియొక్క గురుపదస్వీకారము, వైజయంతియొక్క పాండితీప్రకర్ష జ్ఞానప్రపంచమున పురుషులకు యెంతస్వత్వము గలదో స్త్రీలకు అంతశక్తిగలదని రుజువగుచున్నది.

వేదయుగమున విశ్వపాలాదేవి యుద్ధమొనర్చిన వీరాంగన. పౌరాణికయుగమున 'సత్యభామ'యొక్క పరాక్రమము సర్వజనవిదితము. అటులనే మధ్యయుగమునకూడా 'నాయకురాలి నాగమ్మ' రాణీసంయుక్త, వీరాబాయి, రాణీదుర్గావతి, చాంద్‌బీబీ, ఝాన్సీలక్ష్మిబాయి, మొదలగువీరాంగనలు విలసిల్లారు. అహల్యాబాయి, మీరాబాయివంటి భక్తురాండ్రు ప్రభవించారు.

నాడేకాదు. నేడుకూడా మన కండ్లయెదుట అనేక ప్రఖ్యాతనారీమణులు మనదేశమున ప్రభవించారు. సరోజినీ విజయలక్ష్మి, కమలానెహ్రూ, కమలాదేవిచటోపాధ్యాయ, అరుణాఅసఫాలీ రుక్మిణీలక్ష్మిపతి, రాజకుమారి అమృతకౌర్, హంసమెహతా, సుచేతకృపాలానీ మొదలగువారెందరో కలరు.

ఈ సంగతే అనగా భారతనారీశక్తిని వర్ణిస్తూ "లోకమాన్య తిలక్" యిలాఅన్నాడు..........

“కవి జన్మిస్తాడుగాని తయారుకాడు అని ఆర్యోక్తి. అల్లే త్యాగికూడా జన్మిస్తాడుగాని తయారుచేయబడడు. ఇదే సూత్రం, శౌర్య, ధైర్య, వీరత్యాగాది, విశేషగుణాలకుకూడా వర్తిస్తుంది. తరతరాలనుండి, యుగయుగాలనుండి, మానవ జీవితాన్ని తరచిచూచినగాని ఈ సత్యందోత్యతకంగాదు.......
భారతావని ఈనాడు పారతంత్ర్యమై వుండవచ్చు. కాని ఆ జన్మసిద్ధమైన శౌర్య, ధైర్య, సద్గుణాలంకారులకు ధీరసంతానాన్ని ఆమె ప్రసవిస్తూనేవున్నది. అది ఆతల్లికడుపుచలవ మరి. ఆమె కుమార్తెలగు భారతనారీలోకానికి ఈ ప్రత్యేక సద్గుణ సంపత్తి లేకుండా ఎలావుంటుంది?

వీరమాతలు, వీరపత్నులు, ఈ నాడు భారత స్వాతంత్ర్యసమర రంగములో, విద్యుల్లతవలె మెరుస్తూవుండడం చూస్తూవుంటే, ఆప్రత్యేకత, ఆఘనత, ఆకీర్తి భారతభూమికి తగిపోయింది. పౌరాణికయుగంలో సత్యభామాది వూతచరితులమాట అటుంచండి. ఇటీవల చరిత్రలో ఝాన్సీరాణీ లక్ష్మీబాయి, మనకండ్లముందు మెరసిపోయింది. ఆమెకత్తి తళతళలు మనదృష్టి పథాన ధగధగాయమానంగా మెరసిపోతున్నవి మహారాష్ట్రపు ఝాన్సీపట్టణ పరిసరాలలో అశ్వారూఢయై సంచరిస్తూ ఆమెయింకా మనలను మేల్కొలుపుతునేవున్నది.*

కాని యీనాటి మనస్వతంత్ర సమరములో ఎందరు

* ఝాన్సీపట్టణ పరిసరాలలో రాత్రులందు రాణీలక్ష్మిబాయిగుర్రము మీదస్వారిచేస్తూ, ఖడ్గధారిణియై, తిరుగుతూవుంటుందని పల్లెప్రజలు పలుకుతుంటారు నేటికిని.

ఝాన్సీరాణులు; మరెందరు అహల్యాబాయిలు, జన్మించారో చూడండి. సమీక్షించండి ప్రోత్తేజితులుకండి''.

బాపూజీ ఆరంభించిన స్వాతంత్ర్య సమరములో అగణిత నారీలోకం ఆవిప్లవశక్తికి ప్రజ్వలవుదాహరణ యిచ్చింది. భరతఖండమున ప్రాక్తకాలమున ఎందరో మహానుభావులు, ప్రపక్తలు మహాపురుషులు అవతరించినట్లే, ఆధునిక యుగములోకూడా అట్టి ప్రవక్తను ప్రపంచగురువును, మనకండ్ల ఎదుట గాంచుభాగ్యము గాంచాము. ఇట్టివారు పురుషులలోనే కాదు, యుగ యుగములనుండి భరతభూమిలో నారీశిరోమణు లుద్భవిస్తూనే యున్నారు. ఆధునిక యుగములో భారతస్త్రీలలోనేగాక ప్రపంచ నారీమణులలోకూడా, మిన్నయైన మహిళామణిని మనకండ్ల ఎదుట గాంచాము.

గాంధీజీ జాతిజనకుడయినట్లే సరోజినీదేవి మనమాతృదేవత. అట్టిభాగ్యము మనం పొందుటకు ఆమెలో అట్టి గుణగణాలు ఎట్లుగుమిగూడినవి ? * "ఆభారత మాతృపురాణ సంపద్విశేషమేదో—తన ప్రజ్వలకాంతిని, తన ఆత్మవిశిష్టతను — గంభీరానుభవదత్తమైన ప్రశాంతిని—వివిధ వ్యవస్థావిధానాలను, సమ్మేళనమొనర్చుకొని, యేకీకృతసుందర ప్రౌఢిమతో, పరిఢవిల్లజేసే సమన్వయతను,—విశాలదృష్టితో మానవలోకాన్నిచూచి, తాదాత్మ్యం అనుభవించి, గమనించగల మానవత్వాన్ని— ఆమెలో మరల లోకానికి ప్రసరింపజేసుకొన్నది.

---

1. సరోజినీదేవి 70 జన్మదినోత్సవమున కమలాదేవి చటోపాధ్యాయ వ్రాసిన వ్యాసంలోని భాగాలు (ఆంధ్రవారపత్రిక 1949 ఫిబ్రవరి 16)

ఈసంపదఅంతాకూడా, సరోజిని గీతాలు, రచించినప్పుడు పాడినప్పుడు, ఉపన్యాసవేదికలపైనుంచి ప్రజాసమూహాల నుశ్రోతలూగించినప్పుడు, మహాసభా మంటపాల నలంకరించి నప్పుడు,—ఆమెకు అండగా, భూమికగా, అగోచరంగా ఆమె వెనుకనే నిలచింది.

సరోజినికీ, ఆమె చుట్టునున్న తక్కినవారికీ, ఎప్పుడూ పోలిక లేదు. ఆమె ధరించిన దుస్తులవద్దనుంచీ ఆమె కొక ప్రత్యేకవ్యక్తిత్వాన్నిచ్చేవి. ఆమె నలుగురిలో అలా ప్రత్యేక విశిష్టతతోనే నిలిచేది. అంతర్జాతీయసమావేశాలలో ఆవిడను చూచినవారు ఆప్రత్యేకవిశిష్టతను, గమనించివుంటారు. ఆమె మాట్లాడినప్పుడు ఒక కొత్తనాదం వినిపించేది. భారతమాతృ భూతభవిష్యత్ స్థితులు రెండూ ఆమాటలలో ప్రతిధ్వనించేవి. నిరాయుధులైన నలువదికోట్లమంది భారతీయులు సాయుధు డైన ప్రబలవైరితో యుద్ధానికి పూనుకోగలిగేందుకు మూల శక్తి యేదో ఆమాటలమరుగున శ్రోతలకు గోచరించేది. ఆపలు కుల ద్రాక్షాపాకలాలిత్యంలోనే భారతీయహృదయమార్దవము, వైశాల్యము, సత్యసంపద గోచరించేవి. ఆత్మవిశ్వాసంతో, ఐహికవాదాలమరుగున ఆత్మబలం గోల్పోకుండా, అజేయ మైన ధర్మపథాన్ని, అంటిపెట్టుకొని భారతీయులు ప్రవర్తించ గలిగిన ఆత్మబల మేదో అది ఆమెమాటలలో గోచరించేది.

ఆమె అన్నిమతాల ప్రజలకు నచ్చేటట్లు మాట్లాడగలిగేది. అన్నిరకాల ప్రజానీకానికి అర్థమయ్యేటట్లు చెప్పగలిగేది. కారణం ఆమె యేప్రజలలో జన్మించినదో ఆప్రజలకు "విశిష్టమతం" అన్న అహంభావం లేదు. "ఈమతములో చేరకపోతే నరకానికి

పోతారు" అన్నవాదం లేదు. యుగయుగాలుగా భారతదేశం సంచయపరచుకొన్న ఈ పజ్ఞానమే ఆమె ప్రార్థనగీతాలలో వ్యక్తమవుతున్నది. ఆస్తికనాస్తికవిభేదంకూడా లేకుండా సర్వజనసౌజన్యాన్ని గుర్తించినమతం భారతదేశమతం. కారణం, విజ్ఞానానికి మానదండాలు వేరు. మానవత్వము, సచ్ఛీలము, సౌజన్యము—ఇవి కొలతలు. వీటినే సత్యఅహింసారూపాలలో గాంధీజీ తనలో మూర్తిభవింపజేసుకొన్నాడు.

సాంప్రదాయికమై, పరంపరాగతమైన ఈ భారతీయ సంపద్విశేషంవల్లనే సరోజిని సహజంగానే విశ్వజనీనగా విలసిల్లగల్గింది. ప్రపంచములో, ఆమెకు తనదిగానిది అన్నచోటు లేదు. అందుకనే గర్భదరిద్రులతోకూడా అంత మమైక్యం పొందగల్గింది. వారి నిరాశలలో, వారి నిస్పృహాలలో తానూ, ఒకర్తిగా కాగలిగేది. మళ్ళీ ఇటు మహారాణులు, మహిళాసంఘాలపెద్దలూ, వీరి సమతుములోకూడా వీరితోకలిసి పోగల్గేది. అసలు వీరితోకలసిపోగలగటమేమరీకష్టం. కేవలంపౌడర్లపూతలతో తమ ముఖాలకు అందాలు తెచ్చుకో ప్రయత్నించే ఈ సీతాకోకచిలుకల్లోనుంచికూడా, కొన్ని నిష్ఫురవ్వలను ప్రజ్వలింప జేయగలిగినందుకు ఆమె నెంతయినా అభినందించాలి. సరోజిని ఆ వయస్సు యీ వయస్సు అనకుండా అన్ని 'వయస్సులకు' చెందినవ్యక్తి. పసిపిల్లలతో పసిపిల్లయై పోయి వాళ్లతోపాటు ముద్దుమాటలను ఆలపించగలదు. శతవృద్ధుల ప్రక్కన కూర్చుని పురాణకాలక్షేపం చేసి, వాళ్లకన్నులలో ఆనందమూ నెలకొల్పగలదు. అన్నిటికీ కారణం ఒక్కటే. ఆమె సంపూర్ణ మానవత్వంతో నిండిన స్త్రీమూర్తి. అందుకనే

అందరికీ అంత తేలికగా అందుబాటులో వుండేది. నీరసులకు, అసహాయులకు, అంత అండఅనిపించేది".

ఆమెలో యిట్టి గుణగణాలు మూర్తీభవించుటకు, భారతదేశ పురాణ సంపద్విశేషముతోబాటు, ఆమె దేశవంశ మాతాపితరులసంస్కృతికూడా ఆమెపై ప్రభావం పొంది యుండును. ఆమె మాతృదేశమగు వంగదేశము, ఒకశతాబ్దం భారతభూమికి ఆచార్యపీఠమై అలరారినది. ఆమె వంశము శతాబ్దములనుండి, విద్వాంసులకు, యోగులకు ప్రతిష్ఠచెందిన కులీన బ్రాహ్మణవంశము. ఆమె పితృదేవుడో, విజ్ఞానాచార్యుడు- పుంభావసరస్వతి. ఆమె మాతృదేవతో, వంగ భాషలో మృదుమధురంగా కవిత చెప్పిన కవయిత్రి.

ఇటుల తరతరాల భారతసంస్కృతి పూర్వపుణ్య విశేషమేగాక, దేశ వంశ మాతాపితరుల సంస్కృతికూడా ఆమెలో సమ్మేళనమొందినవి.

ఆమె సహజకవయిత్రియై, ఆంగ్లభాషలో మృదుమధురంగా కవిత్వముచెప్పి ప్రపంచఖ్యాతి గాంచినది. వక్తృత్వములోను, ఆమె అట్టి ఖ్యాతినే గాంచినది. అందుచేతనే 'ప్రాచ్యదేశపు కోకిల' అనునామము కవిత్వ వక్తృత్వాలలో దేనివల్ల కలిగినదో, నిర్ణయించలేకుండా వున్నారు విమర్శకులు.

కవిత్వ వక్తృత్వములతోనే ఆగలేదు ఆమె ప్రతిభ. అది బహుముఖమైనది. ఆమె కార్యరంగము విస్తృతమైనది. ఆమె హృదయ వైశాల్యము, సంస్కృతి అనిర్వచనీయమైనవి. కొందరు ఆమెను మాతృమూర్తిగా భావిస్తే, మరి

కొందరు పితామహినిగా, కొందరు ప్రియసోదరిగా, అనుంగు నెచ్చెలిగా కొందరు, విదుషీమణిగా కొందరు, వీరనారిగా కొందరు, కలలరాణిగా కొందరు, దేశభక్తురాలుగా కొందరు, నాయకురాలుగా కొందరు, ప్రాక్పశ్చిమ సంస్కృతుల సమ్మేళనమూర్తిగా కొందరు, కవయిత్రిగా కొందరు, వక్తగా కొందరు, కళామూర్తిగా కొందరు, ఆమెను యిట్లు పరిపరి విధాల తమ సంస్కృతులను, అనుభవాలనుబట్టి, గ్రహించారు. ఎవరు ఎన్ని విధముల గ్రహించినను అందరకు ఆమె ప్రియతమ గనుకనే ఆమె 'సర్వప్రియ' కాగలిగినది.

వివిధరంగాలలో అర్థశతాబ్దము కాలము అఖండ కృషి చేసినవారు, అందులో భారత రాజకీయాలలో ప్రవేశించి దూషణపొందకుండా వున్నవారు యింతవరకు జన్మించలేదు.

భారతభూమిలోనేగాదు, ఏ దేశములోను ఏ కాలములోనూ, సజీవులై సర్వప్రియత్వము గాంచినవారు లేరంటే అతిశయోక్తి గాదు.

మహిళల శరీరమన ఆత్మవికాసాలకై ఆమె చేసిన సేవ నిరుపమానమైనది. హిందూమహమ్మదీయ మైత్రికై ఆమె ఒనర్చిన కృషి అనన్యమైనది. ప్రవాస భారతీయులకై ఆమె గావించిన ప్రయత్నాలు ప్రశంసార్హమైనవి. భారత స్వతంత్ర సమరములో అగ్రభాగమున నిలబడి, అప్రతిమానముగా పోరాడినది. భారత స్వాతంత్ర్య సముపార్జనతో తృప్తిచెందక అఖిలఆసియా సమైక్యతద్వారా ప్రపంచఐక్యతకై పాటుబడిన విశ్వైక్యానుసంధాయిని.

ఆమె సంయుక్తరాష్ట్ర గవర్నరు అగుట గొప్పగాదు.

అర్ధశతాబ్దకాలము భారతదేశ ప్రజల మనోరాజ్యాల్ని పరిపాలించిన రాణి. ప్రాచ్యప్రపంచమునకే ఆమె రాణిగా భాసిల్లినది.

పూజ్య బాపూజీ ప్రారంభించిన కార్యరంగములలో పాల్గొంటూ, ఆయన సన్నిధానవర్తినియై తల్లిగా, తనయగా, సాకిన సేవావ్రతురాలు.

పెక్కు సుగుణాలతో పాటు ఉత్తమహాస్యరసము ఆమెలో ఆవిర్భవించుట పసిడికి పరిమళ మబ్బినట్లయినది.

భారతదేశము ఆమెను ఆసియాసభకు అధ్యక్షురాలుగా చేయుటలోనేమి, తదితరగురుతర బాధ్యతలు ఆమెయందు ఉంచుటలోనేమి, ఆమెను గుర్తించి, ఆమెకు నీరాజనాలెత్తి తద్వారా స్త్రీత్వంపట్ల తనకున్న సహజగౌరవప్రపత్తులను ప్రకటించి భారతనారీత్వానికి నీరాజనా లెత్తింది.

ఆమె కాంగ్రెసుకిరీటం ధరించుటయే కాదు. కర్ణధారులలో ఒకర్తె ఉండుటేగాక, కర్ణధారులలో స్వీయకళాను భూతిచే కలహాలు లేకుండా రాజకీయరంగంలో కళను ప్రవేశ పెట్టిన కళాతపస్విని. యువజనులు, ఐక్యత ఆమెకు ప్రేమాస్పదములు. ఆమె ఐక్యతామూర్తి, ఆనందదేవత, మాతృమూర్తిని. వేయేల? ఆమెను ఒకవ్యక్తిగా భావించలేము. దేశము, కాలము, సకల సంస్కృతులు, ఆమెలో మూర్తీభవించినవి. ఆమెచరిత్ర, ఆమెజీవితకాలములో భారతదేశ చరిత్ర.

"దౌర్భాగ్యభారతతంత్రులు తెంప
సౌభాగ్యభారతజాతకమ్ము రచింప

సౌందర్యమూర్తివై, స్వచ్ఛందమూర్తివై
భోగిపండుగపాలు పొంగింపగా వచ్చి
నావె సరోజినీదేవీమతల్లీ" — రాయప్రోలు

## వంశవృత్తాంతము

"అచటఁ బుట్టిన చిగురుఁ గొమ్మైనఁ జేవ" — మనుచరిత్ర

ఏ దేశముయొక్క శిరోభాగంబున హిమాద్రి మకుటాయమానంబై శోభిల్లుచున్నదో, ఏ దేశము పవిత్రమగు భాగీరథియొక్క జలంబుచే నిత్యప్రక్షాళితమై, సుజలమై, సుఫలమై, సస్యశ్యామలమై సొలయుచున్నదో, ఎందు శ్రీ చైతన్యు లవతరించి, హరినామమును సకలజనులకును జాతిభేదంబులేక యుపదేశించి, ధరను పవిత్రముచేసి, అమరకీర్తిగాంచెనో, ఎచ్చోట శ్రీ రామమోహనరాయ లుద్భవించి, సహగమనాది సకలదురాచారములు బాపి బ్రాహ్మమతమును స్థాపించి సకలవిషయములలోను, సంస్కృతిబడసి, ఆధునిక భారతవర్షమునకు పితృతుల్యుడని ప్రఖ్యాతిగాంచెనో, ఏ ప్రదేశమున దయాసాగరుడగు విద్యాసాగరుడు సంస్కర్తయై సంస్తుతి పొందెనో, ఎచ్చోట రామకృష్ణపరమహంస, వివేకానంద, అరవింద, బ్రజేంద్రనాధ్ శీల్ మొదలగు వేదాంతు లుద్భవించిరో, ఎందు బంకించంద్ర, రవీంద్ర, శరత్ చంద్ర, ద్విజేంద్రలాల్ రాయ్‌లవంటి మహాకవు లుద్భవించిరో, ఎచ్చోట శిశిరకుమారఘోష్, రామానందచటర్జి మొదలగు పత్రికాధి

పతులు ప్రభవిల్లిరో, ఏ దేశంబున రాసవిహారీఘోష్, ఉమేశ చంద్రబెనర్జీ, గురూ బెనర్జీ, శ్యామసుందరచక్రవర్తి, దేశబంధుదాసు, నేతాజీ మొదలగు రాజకీయవేత్తలు జన్మించిరో; యేభూమి జగదీశచంద్రబోస్, ప్రఫుల్లచంద్రరే మొదలగు విజ్ఞానశాస్త్రవేత్తలకు నిలయమో, ఏది అవనీంద్రనాథఠాగూరు వంటి చిత్రకారులకు, ఉదయశంకరునివంటి నాట్యాచార్యులకు నిలయమో అట్టి విజ్ఞాననిలయమైన వంగదేశమే సరోజినీదేవి వంశజులకు జన్మస్థానము.

భారతదేశములో మొట్టమొదట ఆంగ్లపరిపాలన ఆరంభమైనది వంగదేశమునందే. వారి నాగరికత వంగదేశాన్ని ఆకర్షించింది. ఆ దేశము సర్వవిధాల చైతన్యం పొందింది. తాను చైతన్యం చెందుటయే గాక, సమస్తభారతభూమిని మేల్కొల్పింది. యూరపుఖండములో 'ఇటలీ' ఎట్లా 'యూరపు' వికాసానికి తోడ్పడిందో, అటులనే భారతభూమిలో వంగదేశము ఒక శతాబ్దము ఆచార్యపీఠం అలంకరించింది.

విశేషించి సారస్వతంపట్ల యిది మరింత ప్రస్ఫుటమగుచున్నది. ఈనాడు మన దేశభాషలలో నవలలు, నాటకములు, భావకవిత్వము, కథలు, నవ్యసాహిత్యం అభివృద్ధిగాంచిందంటే వంగీయులు ఆంగ్లేయులవద్ద అభ్యసించి యితరులకు గరపిన విద్య యన్నమాట.

ఇంతే కాదు. సంఘములో స్త్రీలకు అపారగౌరవాదరములు కలుగజేసి విద్యనేర్పినవారుకూడా వారే. అందుచేతనే అట్టి విశాలహృదయములమధ్య తోరుదత్తు, సరోజినీనాయుడు

వంటి ప్రపంచవిఖ్యాతిగాంచిన విదుషీమణులు, కవయిత్రులు కలుగుటలో వింత లేదు.

సరోజినీదేవి పూర్వులు వంశపారంపర్యంగా విద్వాంసులు, తత్త్వవేత్తలు. "My ancestors for thousands of years have been the lovers of the forest and mountain caves, great dreamers, great scholors, great ascetics". వారిది తూర్పుబెంగాలులో చాలా ప్రసిద్ధమైన కులీనబ్రాహ్మణవంశము. ఆమెతండ్రి అఘోర్‌నాధ్ చటోపాధ్యాయ బ్రహ్మనగరమున జన్మించెను. ఆయన గొప్పవిద్వాంసుడు. 1887 సం॥ లో స్కాట్లండులోని సుప్రసిద్ధమైన ఎడింబరో విశ్వవిద్యాలయమున విజ్ఞానాచార్య (డాక్టర్ ఆఫ్ సైన్సు) పట్టమునొంది తదనంతరము జర్మనీయందలి ప్రసిద్ధ విద్యాకేంద్రమగు 'బోన్' (Bonn) లో గొప్పగొప్ప డిగ్రీలు పొందెను. ఆయన ఫ్రెంచి, జర్మను, గ్రీకు, హిబ్రూ, ఆంగ్ల, సంస్కృత ఉర్దూభాషలలో ఉద్దండపండితుడు.

స్వదేశమునకు వచ్చినపిమ్మట హైదరాబాదు నైజామాయనను పిలిపించి సంస్థానములో విద్యాభివృద్ధికై కృషి చేయవలసినదిగా కోరెను. నైజాముకోర్కె ననుసరించి నైజాముకళాశాలస్థాపించి అందులో ఆచార్యుడుగా నుండెను. ఆయన తన జీవితమంతయు, విద్యారంగమునందే గడపిన విజ్ఞానాభిలాషి. చటోపాధ్యాయ్ త్యాగి, గొప్పప్రతిభావంతుడు. పరోపకారము, విజ్ఞానసముపార్జన ఆయనసహజగుణాలు. అందుకై అనవరతము తన ధనమును వెచ్చించెను. ఈగుణగణములచే ఆయన అందరకు ఆదరణీయుడైనాడు. ఆయన సర్వజనసులభుడు. అందుచే

పెద్ద, పిన్న, పండిత, పామర, బీదసాదయను భేదములేక అందరకు ఆయనయిల్లు అతిధిశాల;ఆయన అందరను యేకరీతిని సన్మానించేవాడు. విజ్ఞానఖనియగు ఆయనగృహము వివిధమతప్రముఖులకు విడిది.

అఘోరనాథ్ ఉన్నతసంస్కారహృదయుడే గాదు. ఉత్తమభావుకుడుకూడా, స్వాతంత్ర్యప్రియుడు, సత్యవ్రతుడు, ఋషితుల్యుడు."My father is a dreamer himself, a great dreamer, a great man whose life has been a magnificent failure. I suppose in the whole of India there are few men whose learning is greater than his, and I don't think there are many more beloved. He has a great beard and profile of Humer, and a laugh that brings the roof down." ఆయన విజ్ఞానాచార్యుడేకాదు, కవితాహృదయముకలవాడుకూడ, కాని సరోజినీ కవితావాసన ఆయననుండి కలిగినది గాదు. ఆమెతల్లి వరదాసుందరీదేవివలన గలిగినది. ఆమె యౌవనదశలో వంగభాషలో మనోహరగేయములను వ్రాసిన కవయిత్రి.

అట్టి తలిదండ్రులకు కలిగిన సంతానము సహజప్రతిభాశాలురగుటలో, ఆశ్చర్య మేమున్నది? అట్టి ఉత్తమవాతావరణలో పుట్టి పెరిగినవారు ఉన్నతసంస్కారు లగుటలో అబ్బుర మేమి? సరోజినీ ఆమెసోదరులు వారి మాతాపితల సన్నిధానమున ప్రథమములో విద్యాభ్యాస మొకర్చిన రీతి ప్రశంసార్హమైనది.

సరోజినీ అఘోర్నాథదంపతుల ప్రథమసంతానము. వయస్సు

నందేగాదు ఆమె అన్నిట పెద్దగానే ప్రస్తుతిగాంచినది. ఆమె 1879సం॥ ఫిబ్రవరి 13 వ తారీఖున జన్మించినది. ఆమె ప్రథమ సోదరుడగు వీరేంద్రనాథ చటోపాధ్యాయ 1905సం॥ లో ఐ. సి. యస్. చదువుటకు ఆంగ్లదేశమున కరిగి తిరిగి మాతృభూమికి రాక తనజీవితకాల మంతయు భారతస్వాతంత్ర్యసముపార్జనకై కృషి చేసిన దేశాభిమాని. ఖండాంతరములోని ఆశియానాయకులందరి తోను ఆయనకు పరిచయము కలదు. సోవియట్ పౌరుడై 1941 సం॥లో ఆమహనీయుడు మాస్కోలో మరణించెను. *

ఆమెకనిష్ఠ సోదరుడు హరీంద్రనాథ చటోపాధ్యాయ్ జగమెరిగిన బ్రాహ్మణుడు. నేల నాలుగుచెరగులుచుట్టి వచ్చిన విశ్వసంచారి. ఉత్తమ భావుకుడు. ఆంగ్లభాషయందు గొప్ప కవి. నాటక కర్త, నటుడు, గాయకుడు, చిత్రకారుడు భ్రష్టుడైనయోగి, రసోన్మాది.

ఆమె ప్రథమ సోదరుడు వీరేంద్రనాధుడు రాజకీయ రంగములోనే కృషిజేసిన అతివాది. ఆమె కనిష్ఠసోదరుడు కేవలము రసజగద్విహారి. మన సరోజిని, ఉభయరంగాలలో ఉన్నతశిఖరా లందుకొనుటేగాక కర్కశమైన రాజకీయ క్షేత్రములో రసవాహినుల ప్రవహింపజేసిన కళామూర్తి.

ఈ సోదరులతోపాటు ఆమెకు ముగ్గురు సోదరీమణులు కూడ వున్నారు. ప్రథమసోదరి మృణాళిని 'శ్యామ'అనేపత్రిక పెట్టి ప్రఖ్యాతగాంచినది. ఆమె ద్వితీయసోదరి సువళిని తార.

---

1. ఆమెద్వితీయ సోదరుడగు సత్యేంద్రనాథ, తృతీయుడగు రమేంద్రనాధునిగురించి వివరాలు తెలియవు.

ఆమె కనిష్ఠసోదరి సుహాసిని. హిందూదేశపు కమ్యూనిస్టు పార్టీలో ప్రముఖురాలు. నంబియారుభార్య. పెద్దచెల్లెళ్ళ కళా ప్రియత్వం చిన్నచెల్లెలి ప్రజాసేవ మన సరోజనీలో పరాకాష్ఠ చెందినవి.

# విద్యాభ్యాసము - కవితాంకురము

## పువ్వు పుట్టగానే పరిమళ మబ్బును

అఘోరనాథ్ తన కుమార్తెను విజ్ఞానవతిగా చేయవలెననే సంకల్పంతో ఆమెకు ఆంగ్లములోనే అక్షరాభ్యాసము గావించెను. 6 వయేట ఆమె ఆంగ్లములో సరిగా సంభాషించనందుకు శిక్షగా ఒకనాడంతయు ఆమె తండ్రిచేత గదిలో నుంచబడెను. అట్టి వాతావరణలో పుట్టి పెరుగుటచేత ఆంగ్లభాషయందుగల పాండిత్యాన్ని, మాతృభాషయైన వంగభాషయందు తన జీవితకాలములో సంపాదించజాలక పోయెను. సరోజిని అపారమైన తెలివితేటలు గలది. పన్నెండేండ్ల పసిపాపగా నున్నప్పుడే మద్రాసు విశ్వవిద్యాలయములో మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణురాలైనది. 11వయేటనే ఆమెకు తెలియకుండానే ఆమెలో కవితాబీజము లంకురించినవి. ఒకనాడు ఆమె ఆల్జీబ్రా చేయడం ఆరంభించినది. ఎంత తన్నుకున్నా ఆలెక్క కుదరలేదు. పైగా దానికిబదులు ఒక చక్కని పద్యము వచ్చింది. అదే ఆమె కవితకు ప్రారంభము. ఆనాడుద్భవించిన ఆసెలయేటిగానము, మహాప్రవాహరూపమై పొంగి, పావలి లోకమంతట మంగళగీతాల రూపమున నుంచియెత్తినది. 13వ

యేట ఆమె ఒక గొప్పగీతము వ్రాసింది. అంతట ఆమెకు 'కవయిత్రి' అనుబిరుదుకలిగింది.

అఘోరనాథ్ ఆమెను విజ్ఞానవేత్తగా చేయదలిస్తే ఆమె కవయిత్రి యైనది. తానొకటి తలచిన దైవమొకటి దలచునన్న సామెత ఆమెయెడల సార్థకమైనది.

సరోజిని ఆదినుండియు అంత ఆరోగ్యవంతురాలు కాదు. ఆమెకు ఒకసారి అస్వస్థత కలిగింది. డాక్టరు విశ్రాంతి తీసుకోవలసిందిగా సలహా యిచ్చాడు. ఆమె సంగతి సందర్భములు తెలిసినవాడగుటచేత యేపుస్తకము ముట్టుకోవద్దని హెచ్చరించాడు. కాని ఆ కవితాహృదయ మెలా విశ్రాంతి నొందగలదు ? ఆ జబ్బులోనే ఒకసారి, హఠాత్తుగా లేచి కూర్చొని కలం కాగితం అందుకొని ఆగకుండా వ్రాయడం ప్రారంభించింది. చివర కది రెండువేల పంక్తులుగల మంచి నాటక మయింది.

ఆమె కవితాశక్తిని చూచి ఆనందించి,ఆనాటి నైజాము విదేశాలలో విద్యాభ్యాసమునిమిత్తం సంవత్సరానికి 4500 రూపాయలు విద్యావేతనమిచ్చెను. అంతట ఆమె 1895 సం॥లో విద్యాభ్యాసమునకు ఆంగ్లదేశమున కరిగినది.

లండనులోని కింగ్స్ కాలేజిలోను, కేంబ్రిడ్జిలోని గిర్టన్ కళాశాలలోను ఆమె విద్యాభ్యాసముచేసినది. అక్కడ వుండగా ఆమె పద్యరచన అధికంగా చేసింది. ఎడ్మండ్ గోసి అనే విమర్శకునితో ఆమెకు పరిచయభాగ్యం కలిగింది. ఆయన చక్కని సలహాల నిచ్చాడు. "ఇక్కడికవులమాదిరి, ప క్షులను, కుందేళ్లను వర్ణించవద్దు. మీదేశములోగల ఫల



జ్యేష్ఠపుత్రిక

పద్మజ నాయుడు



ద్వితీయపుత్రిక

లీలామణి నాయుడు

పుష్పవృక్షాలను వర్ణించి, భారతదేశవాతావరణలో కవిత్వం చెప్పిన మంచి కవయిత్రివిగా ప్రసిద్ధిగాంచగల" వని చెప్పాడు. అసలహా ఆమెకవిత్వంలో గొప్ప మార్పు తెచ్చి, ఆమెకు అఖండ ఖ్యాతి దెచ్చింది.

ఈచెట్టుమీాదనుండి ఆచెట్టుమీాదకు, ఆచెట్టుమీాదనుండి ఈచెట్టుమీాదకు స్వేచ్ఛగా విహారించే ఆకవికోకిలకు అధికారుల ఆజ్ఞలకులోబడి విద్య అభ్యసించటం సహజస్వేచ్ఛను కోరే ఆమె జీవితానికి సరిపడలేదు. క్రమంగా ఆమె ఆరోగ్యం నానాటికి తీసికట్టులోకి వచ్చింది. అందువల్ల ఆమె విద్యాభ్యాసము చాలించి, ఆరోగ్యమునకై స్విడ్జర్లాండు వెళ్ళింది. ప్రకృతిసౌందర్యానికి ప్రసిద్ధిగాంచిన ఆదేశం ఆమెకు ఆరోగ్యం కలుగజేయుటయేగాక, ఆమెలో అధికప్రభావము కలుగజేసి, ఆమె కవితాలతకు దోహదం కలుగజేసింది. స్విడ్జర్లాండునుండి ఇటలీకి వెళ్ళి అక్కడ కొన్నాళ్ళుండి 1898లో మనదేశమునకు వచ్చినది.

Childhood shows the man
Morning shows the dawn.

అరుణరేఖలు ఉషోదయమును సూచించునట్లు బాల్యము జీవితభవితవ్యమును చూపును.

# కావ్యార్చన

"Poetry is the flower of magic, not of logic"
—Edith Sitwell

"కిం కవే స్తస్య కావ్యేన కిం కాణ్డేన ధనుష్మతః
పరస్య హృదయే లగ్నం న ఘూర్ణయతి యచ్ఛిరః"

పరుని (శత్రుని) హృదయమున నాటి, శిరమును ఘూర్ణిల్ల జేయలేని, ఆవిలుకానిబాణముతో నేమి పని? పరుని (యితరుని) హృదయమున నాటి శిరఃకంపము చేయింపలేని ఆ కవి కావ్యముతో నేమిపని ?

వక్త, ప్రవక్త, కవి ప్రజల ఉన్నతికి పాటుపడేవారే. లోకకళ్యాణకారకులు వారు. రాజకీయవేత్తలుగూడా వక్తలు గావచ్చును. వారు తమ వక్తృత్వముద్వారా ప్రజాహృదయాన్ని చూరగొని తమ కార్యాలను సాధించుకొందురు.

అలాగే ప్రవక్త, అజ్ఞానాంధకారమైన ప్రపంచములో అర్థకామాసక్తులై, తామసరాజసగుణప్రధానులగు మనుష్యులను, తమ ఉత్తమబోధనలచేతను, స్వీయసాదృశ్యముచేతను, వారిని మార్చుటలో, అభివృద్ధిపరుచుటలో లోకాన్ని కంటక రహితంగా చేయుచు తత్కళ్యాణమునకు పాటుబడును.

కవి రాజకీయవేత్తకంటె, వక్తకంటే ఉత్తముడు. వారి కంటే ఉన్నతిభావాలుగలవాడు. ఆభావాలు హృదయంగమంగా చెప్పగల నేర్పరి.

స్త్రీ పురుష ప్రపంచములో పురుష ప్రపంచము గాంభీర్యశోభితము. నారీప్రపంచము లలితగుణరంజితము. తర్క,

వ్యాకరణ, గణితాది, కర్కశవిద్యలు పురుషప్రకృతి కనుగుణమైనవి. కవిత్వ, సంగీతనృత్యాది లలితకళలు స్త్రీల కోమల హృదయమున సహజలావణ్యముతో వికసించును.

భారతభూమిలో ఆంగ్లభాషలో మృదుమధురంగా, కవిత్వముజెప్పి ప్రపంచఖ్యాతిగాంచిన నారీమణులు యిరువురు—తోరూదత్తు, సరోజిని.

వారిద్దరు బెంగాలీలగుట విచిత్రములలో విచిత్రము. నిరుపమమైనభాష, సహజపదమైత్రి, ఉత్తమసౌందర్యము, శ్రవణానందము సరోజినిలోని కవితావిశేషములు.

ఆమె యశోధనాపేక్షలతో కవిత చెప్పలేదు. ఉత్తేజము కలిగినప్పుడే కవితచెప్పింది. కాని ప్రయత్నపూర్వకంగా చెప్పలేదు.

సరోజినీ కవిత్వములోని మరియొకవిశేషము ప్రకృతి వర్ణన. భారతదేశగిరికందరాలను, తరులతఫలపుష్పాదులను వర్ణించింది.

ఆమె ఆంగ్లంలో కవిత్వంచెప్పినా, ఆమె అలంకారాలు, ఉపమానాలు, అన్నీ భారతీయసంప్రదాయములే.

ఆంగ్లముద్వారా భారతదేశగుణగానం చేసి, ప్రాక్పశ్చిమఖండాల సమ్మేళనకు అవకాశము కలిగించింది.

ఆమెకు శాశ్వతకీర్తినిచ్చేది ఆమెకవిత్వముగాని సాంఘిక సేవ గాదు. రాజకీయా లంతకంటె గాదు. ఇవి బుద్బుదప్రాయములు.

1914 లోనే ఆమె 'రాయల్ సొసైటి ఆఫ్ లిటరేచర్'కు

సభ్యురాలుగా ఎన్నుకోబడుటచే ఆంగ్లకవులతో అధికపరిచయం కలిగి ఆమె కవితకు దోహదం కలిగింది.

ఆమె రచనలు నాలుగు సంపుటాలుగా ప్రచురింపబడినవి. ప్రథమసంపుటము "సువర్ణప్రాంగణము" (The Golden Tnreshold). ఇందులో 1899 - 1905 వరకుగల ఆమె రచనలు గలవు. ఇది 1905 సం॥రంలో ప్రకటింపబడి, పెక్కు ముద్రణలనంది ప్రపంచఖ్యాతి గాంచినది. దీనికి సుప్రసిద్ధ విమర్శకుడగు ఆర్థర్ సైమన్సు పరిచయం వ్రాసి ప్రచారమునకు తోడ్పడెను.

రెండవసంపుటము "జీవన్మరణగీతాలు" (The poems of Life and Death). దీనినామము సార్థకమైనది.

మూడవసంపుటం "కాలవిహంగము" (The Bird of Time). ఇది 1912 సం॥రంలో ప్రకటింపబడినది. ఇందులో ఆమె కవిత పరిణతిగాంచినది. ఆమె సంపుటాలన్నిటిలో ఇది సర్వోత్తమమైనది. దీనితో ఆమె కీర్తి ఇనుమడించింది. పాఠకులు ప్రపంచమంతటా పెరిగారు. దీనికి ఆమె కవితలో మార్పుతెచ్చిన ఒక విమర్శకుడు ఎడ్మండ్ గోసె పరిచయం వ్రాశాడు.

నాల్గవసంపుటము 'ఛిన్నగరుత్తు' (The Broken Wing) ఇది 1917 సం॥లో ప్రకటింపబడినది. ఇది ఆమె రచనలలో కడపటిది. కవితారీతులందును కడపటిదే. దీనికి కారణము పెక్కుమంది విమర్శకులు పెక్కువిధాలుగా చెప్పారు. ఆమె రాజకీయరంగములో ప్రవేశించుటయే కారణ మన్నారు కొందరు. రాజకీయాలలో ప్రవేశించనంతమాత్రాన ఆమె

కళాదృష్టి నశించలేదు. కర్కశమైన రాజకీయాలలోనే ఆమె కళాదృష్టి ప్రవేశపెట్టింది. ఈ విధంగా ఆమె కళాదృష్టి విస్తృతమైనదిగాని కుంటువడలేదు. ఆమెలో కవితాశక్తి సన్నగిలుటకు ప్రేరణాశక్తి (ఇన్‌స్పిరేషన్) లోపించుటయే కారణము. ఆ శక్తి క్షీణించకుండా ఉండుట కామె ప్రయత్నించిందిగాని, సఫలతనొందలేదు.

ఆమె రచనలు ఫ్రెంచి, జర్మనుభాషలలోనికిగూడా అనువదింపబడి, ఆంగ్ల భాషాజ్ఞానము లేనివారికిగూడా కావ్యానందము పొందుటకు అవకాశము కల్గించినవి.

ఆమె సంపుటములలో ఒకటయిన 'The Golden Threshold' చదివి W. T. స్టెడ్ అనే పాశ్చాత్యుడు "స్త్రీలు కమ్మనికవిత చెప్పలేరనేవారికి యీ గ్రంథమే జవాబు" అనిఅన్నాడు.

జపాన్ టైమ్సులో Alfred E. Pheres అనే ఆయన ఆధునికజీవిత ప్రపంచకవయిత్రులలో సరోజినీదేవి అగ్రగణ్యయని నిస్సందేహముగా చెప్పవచ్చునని ప్రకటించెను.

"ప్రేమతో ఆధ్యాత్మికచింతనను సమన్వయము చేయగల కవి రవీంద్రుడు, కవయిత్రి సరోజినీదేవి" అని సింహళకాంగ్రెసు అధ్యక్షు డన్నాడు.

Selected poems by Indian Women లో మార్గరెట్ మైకనికోల్ అంటుంది.

"సరోజినీకవిత వైషమ్యములను పోద్రోలి, సర్వసామంజస్యమును తేగల మధుర ప్రవాహము. The Nightin

gale of the East, (ప్రాచ్యదేశపు కోకిల) అను బిరుదు సరోజినికి అక్షరాల తగినదే."

ఆమె కవితామాధుర్యమునుగూర్చి ప్రపంచప్రముఖులు పరిపరివిధాల ప్రస్తుతించిన సంగతి పాఠకులకు పరిచయము చేయబడినది. మధుమక్షికాన్యాయమున ఆమె గీతారసాస్వాదన చేదాము.

"పాలకీ బోయ"లనే ఆమెగీతం చాలా ప్రసిద్ధిగాంచినది. అది విశ్వసాహిత్యములో ప్రముఖస్థానము నొందతగినది. ఆగీతములోని లయ, గతి, సంగీతము, మృదుత్వము మొదలగు గుణగణాలు విశాలమైన ఆంగ్లసాహిత్యభాండారములోకూడా అరుదంటె ఆశ్చర్యమొంద పనిలేదు. నవవధువు పుట్టింటినుండి అత్తవారింటికి ప్రథమపర్యాయముగా ప్రయాణమై వెళుతూన్నది. ఆ అందాలబరిణను అతిజాగ్రత్తగాను, ఆనందంగాను తీసుకొని వెళదామని బోయలు తలపోస్తారు. ఆశబ్దాలపొందిక సరిగా ఆ బోయలు అతిజాగ్రత్తగా మెల్లగా అడుగులు వేస్తున్నట్లే, ఆకుసుమకోమలాంగి అంత సున్నితమైనట్లె మనకు గోచరిస్తుంది. ఆ బోయులు ఆనందంతో ఆమెను మోసుకొని పోతున్నట్లె కనపడుతుంది.

Lightly, O lightly we bear her along,
She sways like a flower in the wind of our song,
She skims like a bird on the form astream,
She floats like a laugh from the lips of a dream,
Gaily, O gaily, we glide and we sing,
We bear her along like a pearl on a string.

"తేలికగా, ఎంతో తేలికగా ఆమెను మేము మోసుకొనిపోవుచున్నాము. మాపాటల గాలితరగలలో ఆమె పూవువలె తూగాడుచున్నది.; సెలయేటి నురుగుపై శకుంతమువలె కదలాడుచున్నది; స్వప్నసుందరి పెదవులమీది సుహాసమువలె తేలియాడుచున్నది. ఆనందముతో ప్రమోదముతో పాడుకొనుచు సాగిపోవుచున్నాము. సూత్రముపై ముత్యమునువలె ఆమెను మోసుకొనిపోవుచున్నాము."

బోయలనడక సాగినకొద్ది పాటయొక్క గతి, లయకూడా తదనుగుణ్యముగానె సాగును.

Softly, O softly we bear her along,
She hangs like a star on the dew of our song,
She springs like a beam on the brow of the tide,
She falls like a tear from the eyes of a bride.
Lightly, O lightly we glide and we sing,
We bear her along like a pearl on a string.

మృదువుగా, మృదువుగా మందగమనముతో ఆమెను మేము మోసుకొనిపోవుచున్నాము. మాసంగీతతుషారపటలముపై ఒక తారకవలె ఆమె ఊగిసలాడుచున్నది; తరంగభ్రూభంగిమపై ఒక కాంతికిరణమువలె నృత్యకళావిభాసిత అగుచున్నది; నవవధువు కన్నీటిబిందువువలె ఆమె జాలిపడుచున్నది. తేలికగా తేలికగా పాడుకొనుచు సాగిపోవుచున్నాము. సూత్రముపై ముత్యమువలె ఆమెను తీసుకొనిపోవుచున్నాము.

ఇటుల గ్రామీణదృశ్యాలను చిత్రించుటలో ఆమె చతురతను చూపించినట్లే, ప్రేమతత్వములోకూడా ప్రఖ్యాతి

రాలే అన్ని, ఈ గీతాన్ని గాంచిన బోధపడగలదు. ప్రేమతత్వ ములో ఆమె ఆధ్యాత్మికభావము అరయనగును.

But in the desolate hour of night when,
An ecstasy of a starry silence sleeps,
O'er the still mountains and the soundless deeps,
And my soul hungers for thy voice, O them,
Love, like the magic of melodies,
Let thy soul answer mine across the sea.

నిశ్శబ్దతారకాగణముల మహానందము నిశ్చలపర్వత శ్రేణులపై, నీరవసముద్రతతిపై నిద్రాముద్రితమైయుండు నిశార్ధభాగమున — ఆ శూన్యఘడియలలో — నీ కంఠస్వరము కొరకై, నాఆత్మ తపించుచుండు ఆసమయమున — ఓ నాప్రియతమా! నాయీ ఆత్మ పిలుపునకు ఈసముద్రపు ఆవలిగట్టునుండి సంగీతకళామాధుర్యమాగ్ధ్యమును దులకించు నీజవాబును వినిపించవలె సుమా!

ఆమె ఈదిగువ గీతములో ప్రేమ ఎలా పరాకాష్ఠ పొందినదో పరికించుడు.

You haunt my waking like a dream,
My slumber like a moon,
Pervade me like a musky scent,
Posses me like a tune,
What war is this of the and me?
Give O'er the wanton strife,
you are the heart within my heart,
The life within my life.

"నేను మెలకువతో నున్నప్పుడు స్వప్నమువలె, నిద్రలో నున్నప్పుడు చంద్రబింబమువలె నీవు నన్ను వెన్నంటియున్నావు. కస్తూరికాసౌరభమువలె నన్ను పొదువుకున్నావు. గీతికా స్వరమువలె నాకు పరవశత్వము గొల్పుచున్నావు. ఈ'నీ''నా' సంఘర్షణ ఏమిటి? నిరర్థకమైన ఈపెనగులాట కిక స్వస్తిచెప్పు. నీవు నాహృదయమునకు హృదయమవు. నాప్రాణమునకు ప్రాణమవు."

ప్రేమరచనలలో ఆమె పెద్దరికంపొందినటులే, విషాద గీతాలను ఆమె విన్నాణంగా రచించింది. ఆమె సానుభూతి, మాతృత్వం, సువిశాలం. శతాధిక బాలబాలికల కామె చేలాంచలమే ఆశ్రయమై శాంతిసౌఖ్యా లిచ్చింది. ఆమెకవితలోను యిట్టి ఆమెపోకడలు పరికించవచ్చును. అనాథబాలుడు (The lonely child) అనేరచనలో భారతస్త్రీయొక్క కరుణార్ద్రహృదయము, మాతృభావము కనిపించును. 'అనాథబాల' గీతము కరుణరస రచనలలో సర్వశ్రేష్ఠము.

Silver star! will you be my mother,
Will you stay with me and kiss me,
  In the black night when I cry?
Laughing wind! I want you for a brother
will you play with me and tell me
  story of the see and sky?
Sometimes O wind, you know I am so lonely;
O star, I am afraid of sounds and creeping
  shadows on the wall;

God kisses and loves little children
Only I wish that he had made some one
to love me and to hear me call.

అనాధబాలుడు అమాయకంగా, దీనంగా ఇట్లా అంటాడు. "ఓ నక్షత్రమా! కాళరాత్రిలో భయకంపితుడనై నేను విలపిస్తున్నప్పుడు, తల్లివలె దగ్గరకు తీసుకొని నన్ను నీవు ముద్దిడుకోవూ? ఓ సమీరమా! నీవు నాసోదరునివలె నాతో వుండి సముద్రాకాశకథలు చెప్పవూ? ఓ సమీరమా! నేను ఎలా ఏకాకిగా వుంటున్నానో ఎరుగుదువా? ఓ నక్షత్రమా! గోడపైబడే నీడను చూచి, ధ్వనిని విని నేను భయకంపితుడనగుచున్నాను. భగవంతుడు బాలురను ఎంతో దయగా చూస్తాడనీ, ప్రేమిస్తాడనీ, ముద్దాడుతాడనీ విన్నాను. కాని నా పిలుపు వింటూ నన్ను ప్రేమించేందుకు ఎవ్వరినైనా వుంచితే ఎంతబాగుంటుంది."

ఈమాటలు ఎంత కఠినహృదయాన్నైనా ద్రవీభూతం చేయగలవు.

ఆమె కవితలోని మరియొకవిశేషం విషయాన్ని అనుసరించి ఛందస్సు వుంటుంది. ఆమె తన ఆంగ్లకవితలో బెంగాలీ ఉర్దూ ఛందస్సులనుకూడా విన్నాణంగా ఉపయోగించింది.

'నిద్రాగీతం' (The song of sleep) ఈ గీతంలోని సంగీతము, మాధుర్యము, పదుగుపేకవలె కలసి ఎట్లా ఆనందాన్ని చేకూర్చినవో గమనించండి.

From groves of spice,
O'er fields of rice,

Athwart the lotus stream,
I bring for you
Aglint with dew
A little lovely dream.

"సుగంధకుంజములనుండి, శాలి కేదారోపరితలమునుండి పద్మరజఃప్రవాహములనుండి నీకొరకు తుషారబిందుసమ్మిళిత సుందర స్వప్నాన్ని తెచ్చాను."

ఆమె మనకు ఎన్నో సుందరస్వప్నాలను తెచ్చి మన జీవితాలను ఆనందమయముచేసిన స్వప్న దేవత, కలల రాణి.

అందుచేతనే ఆమె అమరకవితా గానమునుగూర్చి రాయప్రోలు అంటాడు :—

"పన్నీటిసెలయేళ్లు ప్రవహించినట్లుగా
సన్నతంత్రులవీణె సవరించినట్లుగా
పాడినా వానందబంధసుందరగీతి
స్వాదుపదావళీసామ్రాజ్యమునకు
రాణివై, కవనకళ్యాణివై నీవు"

వేయేల ? ఆమె కవిత్వము స్వయంపాకంవలె పవిత్రమైనదేగాక నలభీమపాకంవలె స్వాదిష్టమైనదికూడా !

కాళిదాసు గతించాడు, "శాకుంతలము" నిల్చేవున్నది. షేక్స్పియర్ మరణించాడు, "హేమ్లెట్" అజరామరమై అభివృద్ధి గాంచుతూనే వున్నది. రవీంద్రుడు అస్తమించాడు, "గీతాంజలి" గౌరవం పెరుగుతూనే వున్నది. సరోజిని స్వర్గస్థురాలైనది, "కాలవిహంగము" కాలముతోపాటూ విహరిస్తూనే ఉంటుంది.

# వక్తృత్వము

" రాకేందుబింబమై రవిబింబమై యొప్పు
నీరజాతేక్షణ నెమ్మొగమ్ము. "

" There is no power like that of true oratary. Caesar controlled men by exciting their fears; Cicero by captivating their affections and swaying their passions. The influence of the one perished, with its author; that of the other continues to this day."

—Henry Clay.

వక్తృత్వానికి, కవిత్వానికి సన్నిహితసంబంధమున్నది. వక్త కవికి సైదోడు. ఆకారాలు భిన్నముగాని అంతర్యముఒకటే ఆరితేరిన కళోపాసకుడు అద్భుతమైన వక్త కాగలడు. కవికి, వక్తకు ఆవేశము అధికముగా వుండాలి.

స్వీయభావములను ప్రచారముచేయుటకు మార్గాలున్నా ప్రచారసాధనాలన్నిటిలోను, సమధికమైన సాధనము వక్తృత్వము. వక్త ప్రజలమధ్య నిలుచుండి ఉపన్యసిస్తూంటే భావప్రచారము అధికంగా వ్యాప్తిచెందగలదు. ఇంతేగాక ఈప్రచారము శ్రోతలహృదయాలలో అధికకాలం వుండగలదు. ప్రాచీనకాలములో పేరుపొందిన వక్తలు తమ ఉపన్యాసాలద్వారా అనేక కార్యాలు సాధించిన సంగతి ప్రపంచ చరిత్ర చెప్పును.

మన దేశములో అనేకమంది వక్తలు జన్మించారు. కాని సరోజనీదేవిలో ఒక విశేషము కలదు. ఆమె ప్రపంచ

మునకు కవయిత్రిగా ప్రథమమున ఎరుకబడుటేగాక అఖండ ఖ్యాతి గాంచినది. కాని ఆమె వక్తృత్వనైపుణ్యం, ఆమె కవితాగుణముకన్న అధికమేమో అనిపించును. ఆమె ప్రపంచమంతా పర్యటనజేసి వచ్చినది. వేలాది ఉపన్యాసాలిచ్చినది. ఎట్టి కఠినసమస్యనైనా, హాస్యంతో సర్వజనగ్రాహ్యంగా ఉపన్యసించి శ్రోతలు ఆనందంపొందునట్లు చేయగల నేర్పు ఆమెకు అధికంగా వుండేది. ఆమె ఉపన్యాసములో తర్కవితర్కము లుండేవికావు. వాదనాసామర్థ్యము కనపరిచేది కాదు. ఆమె కంఠం విప్పితే కోకిలగానమే! [1]

సరోజినీదేవి ప్రపంచవక్తలలో ప్రఖ్యాతురాలు. ఆమె విశేషంగా తమ ఉపన్యాసాలవల్లనే భారతభూమికి ఖ్యాతి తెచ్చుటేగాక దేశస్వాతంత్ర్యానికి తోడుపడింది. అర్ధశతాబ్దము నుండి ఆ సేతుహిమాచలపర్యంతము ఆమె అనేకపర్యాయములు పర్యటనచేసి అనేకసభలలో పాల్గొని దేశభక్తిసంకీర్తనద్వారా దేశాభిమానాన్ని ప్రజలలో పురికొల్పినది. ఆమె ఆంగ్ల, హిందీ, ఉర్దూ, వంగభాషలలో అనర్గళంగా ఉపన్యసించి వేలాదిజనాన్ని దేశస్వాతంత్ర్యానికిఆత్మార్పణచేయుటకు కారణభూతురాలైనది. [2]

---

1 ఆమెకు "భారతకోకిల" అనే ప్రఖ్యాతనామము కవిత్వమునగాక వక్తృత్వమువల్లనే వచ్చినదనును ఆమెసోదరుడు హారీంద్రనాథ్.

2 పండిత జవహారిలాల్ ఆమె ఉపన్యాసవైఖరిని గురించి ఇలా అన్నాడు: "లక్నో కాంగ్రెసు ముగిసినతర్వాత (1916) సరోజినీదేవి అలహాబాదులో యిచ్చిన ఉపన్యాసములు మమ్ములను కదల్చివేసెను. అవి జాతీయతతోను, దేశభక్తితోను యిమిడివుండెను..." ఆత్మకథ 44.

ఆమె ఉపన్యాసాలు రెండువిధాలుగా వుండేవి. ఆమె సహజంగా చెప్పే ఉపన్యాసాలు గానామృతమువలె శ్రోతలను తన్మయత్వం చేసేవి.

ఆ యా ఘటనలమీద ఆమె చేసిన ప్రసంగాలు(Epic) వీరకావ్యాలవలె ఉద్రేకం కలిగించేవి. సహజప్రసన్నవదనయైన సరోజినీదేవి ఆ సమయములో రుద్రకాళివలె వుండేది.

మొత్తంమీద ఆమె ఉపన్యాసాలన్నీ కవితాగుణము కలవే. అవి ఛందోబద్ధము గాకపోవచ్చు. ఛందోబద్ధమైనంత మాత్రాన కవితాగుణ ముంటుందా? [1]

కవిత్వము గుణములో వున్నదిగాని గణములో లేదు. ఆమె ఛందోబద్ధకవిత్వానికి స్వస్తిచెప్పినా, ఆమె వాకొన్నదంతా కవిత్వమే. ఆమె ఉపన్యాసాలన్నీ గీతాలే. [2]

[3] "ఆమె గొప్పతనమంతా అనుపమాన ఉపన్యాస వైఖరిలోనే ఉన్నది. ఆమె ఉపన్యాసమును వినుటకు ఎంత దూరమైనా శ్రమపడివెళ్లవలసివచ్చినా వెళ్లవలసినదే. ప్రతి

---

1. ఆంధ్రనామ సంగ్రహం ఛందోబద్ధమైనదే, అందులో కవిత్వమున్నదా?

2. 1920 లో లండను ఆల్బర్టుహాలులో పంజాబు దురంతములనుగురించి ఆమె చేసిన ప్రసంగం ఒక వీరగీతము. 1925 లో కాంగ్రెసు అధ్యక్షపీఠము నుండి యిచ్చిన ఉపన్యాసం స్వాతంత్ర్యగీతం. 1929 లో అమెరికాలో ఆమె యిచ్చిన మహోపన్యాసం ఒక సందేశగీతం. 1947 లో ప్రాచ్యమహాసభలో ఆమె ప్రవచనము ఒక ప్రబోధగీతం. 1948 లో మహాత్ముని ప్రస్థానమును గురించి ఆమె హృదయకుహరమునుండి వెలువడినవాక్కు ఒక విషాదగీతం.

3. 'ఇన్‌సైడ్ ఇండియా' అను మదామ్‌హాలైడ్ ఎడిబ్ గ్రంథం నుండి.

పదమునందు కవిత్వపుతళుకు ప్రతిఫలించుచుండును. ఏదో ఒక సభలో ఉపన్యసించమని ఆమెకాహ్వానాలే ఆమె నిరాకరించిన ఆహ్వాన మొకటీలేదు. చేపకు ఈదడ మెంతసులువో ఆమెకు ఉపన్యాసాలివ్వడం అంతవేలపింగి ...

ఆమె మొట్టమొదట అతిమందరస్థాయిని కంఠమెత్తినది. నలుగురూ ఉపయోగించే పదాలనే ఉచ్చరించినది. ధోరణిలో అలంకారాలుగాని అతిశయోక్తులుగాని యేమీ లేవు. అయితే కంఠస్వరం క్రమంగా హెచ్చింది. రంగురంగుల విశేషాలతో ఉపన్యాసస్థాయి హెచ్చింది. చిట్టచివరకు వెళ్లేసరికి అత్యుత్తమఉపన్యాసప్రవాహమైనది. మాటలకొక్కరవ్వ తడుముకోవటంలేదు. వాక్యాలు దీర్ఘతమాలవుతూంటే అన్వయాలకోసం తొట్రుబాటు అసలే లేదు. ఆమె పదముల సౌందర్యం, కల్పనలచాతుర్యం హెచ్చుచున్నకొద్దీ, ఆమె శరీరంకూడ మీదిమీదికెగురజొచ్చింది. చివర కా ఖర్వనారీమణి విక్రమించి, విక్రమించి, అఖర్వావతారంగా పరిణమించింది. ఉపన్యాసాంతిమావస్థయందు ఆమె సరిగా బొటనవ్రేళ్ల మీద నిలిచినదంటే నమ్మండి. ఇందులో ఆశ్చర్యం లేదు. ఏలననగా ఆఔన్నత్యమంతా ఆమెశరీరఔన్నత్యం కాదు. మానసికఔన్నత్యం. ఆమె ఏమిమాట్లాడిందో నాకిప్పుడు జ్ఞాపకంలేకపోయినా, ఆ యువజన సభ్యులందరు ఎంత ఉత్తేజంపొంది చంచలితులైనారో నేనుకూడ అంతఉత్తేజంపొంది చంచలిత నైతిని.

ఆమె విశిష్టస్వత్వమైన పదములశక్తిని, ఈఅలంకారముల వైఖరిని, ఈ ఉపన్యాసాలధోరణిని ఇరవై సంవత్సరాలకుపైగా ఆమె భారతదేశ స్వాతంత్ర్యసాధన ఉద్యమమునకు అర్పించింది.

దేశం ఈచివరనుండి ఆచివరవరకుతిరిగి లక్షలాదిప్రజలలో ఆమె ఉత్తేజము కలిగించింది. భారతదేశ స్వాతంత్ర్యము ఒలిచిన అరటిపండువలె సభ్యులచేతులలో తాండవిస్తూన్నట్లే ఆమె భ్రమపెట్టగలిగింది.''

కవితాగుణము, కమ్మని కంఠస్వరము, సహజపరిహాస కుశలత, గంగాప్రవాహమువలె సహజంగా సాగిపోయే వాగ్ధోరణివల్ల ఆమె ఉపన్యాసాలు అందరిని ఆకట్టేవి; ప్రతిమలను చేసేవి. ఇట్టి అనర్గళోపన్యాసాలద్వారా ఆమె విశ్వప్రఖ్యాతిగాంచుటేగాక భారతసంస్కృతికి, భారతస్వాతంత్ర్యానికి సేవజేయూతనిచ్చి చరితార్థురాలైనది. సరోజినిజన్మ సార్థకము.

'చైత్రపల్లవముల సరిక్రొత్తరుచులలో
పరిమళంబెగబోయు బాలమామిళ్ళలో
తీయగా రాగాలు తీసేటి కోయిల
హృదయంగమశిరీషమృదుమంజుఫణితి
నేర్పెనేమొ సరోజినీదేవి! నీకు.'

—రాయప్రోలు.

(3)

# యువజనులపై ప్రేమ—ప్రభావము

"మానాభిమానముల్ — మగటిమి మించ
ప్రబలింపగలవారు — బాలురేసుమ్ము
బాలురె పెద్దలు - బల్లిదుల్ వారె;
బాలురకే వృద్ధి — పరికించిచూడ,
పెద్దలు మతిచెడి — పిరికివారుదురు;
పాంచభౌతిక దేహ — పటిమ క్షీణించు
మనసు చలించును — మాటిమాటికిని
ధైర్యంబు తగ్గు — నుత్సాహంబు లుడుగు
వయసుమీరినవేళ — వచ్చునా బలిమి ?
కీర్తికెనను నప — కీర్తికైన,
బాలురపై నుండు — భారమంతయును"

— పల్నాటివీరచరిత్ర

'భారతోద్ధరణ యువజనులవల్లనే కలుగ గలదు' అని సరోజినీదేవి భావించి వారియెడల అచంచలవిశ్వాసముతో వుండేది. అందువలనే ఆమె అధికంగా విద్యార్థులకు, యువ జనులకు ఉపన్యాసాలు యిస్తూ వారిలో దేశభక్తి కలుగుటకు అధికంగా కృషిచేసినది. ఏ దేశముయొక్క భవిష్యత్ భాగ్య మైనా ఉజ్జ్వలముగా ఉండాలంటే యువజనులపై ఆధారపడి ఉన్నదని ఆమె బాగుగా గ్రహించినది. అందుచేతనే వారిపై ఆమెకు అత్యధికప్రేమ. 1917 లో మద్రాసులో ఒక ఉపన్యా సములో "భాషాభాండారమునుండి నీహృదయాంతరమైన ఆశ యేది, అదేదో ఒక్క వ్యాపారములో నన్ను చెప్పమని అడిగి

నట్లయితే - నేనిలా యీవాక్యము వచిస్తాను "మీపైనే భవిష్యత్ ఆధారపడి వున్నది"

1922 లో అహమ్మదాబాదులోని విద్యార్థిసభకు అధ్యక్షతవహించి తన హృదయాంతరములోని ఆశ, అభిలాషలను ఇలా ప్రకటించినది "నాసమాధిపై యీవిధంగా వ్రాయతలుస్తాను. భారతదేశయువజనులపై యీమెకు ప్రేమ అధికం; అధికంగా వారినే విశ్వసించింది. వారితోనే ఆమె అధికంగా కృషిచేసింది. వారి సహాయముచేతనే భారతస్వాతంత్ర్యాన్ని సంపాదించింది."

యువజనులపై ఆమెకుగల ప్రేమవిశ్వాసము లట్టివి. ఇక యువజనులపై ఆమె ప్రభావాన్నిగురించి. ఆమె అర్ధశతాబ్దమునుండి దేశమంతటా తిరిగి దేశభక్తి ప్రబోధించినందువల్ల అసంఖ్యాకులైన యువతీయువకులపై ఆమె ప్రభావం కలదు. నేడు సుప్రసిద్ధులైనవా రెందరిపైనో ఆమె ప్రభావం ఉన్నదని ఆమె మరణానంతరము స్పష్టపడినది.

"నేను విద్యార్థిగా వున్నరోజులలో (నలభై అయిదు సంవత్సరాల క్రిందట) దాదాభాయి అధ్యక్షత వహించిన కాంగ్రెసులో ఆమె చేసిన గంభీరోపన్యాసం నే నిప్పటికీ మరువజాలను. ప్రజలలో ఉత్తేజోత్సాహాలు రేకెత్తించుటలో ఆమెకుసాటి యెవ్వరు లేరు." అని రాజేంద్రబాబు పాట్నాలో జరిగిన సంతాపసభలో వెలిబుచ్చాడు.

ఆయనే కాదు. మనప్రధానినెహ్రూ తన అభివృద్ధికి ఆమె కారణం అంటూ మార్చి 2వ తారీఖున చేసిన లక్నో రేడియో ప్రసంగములోని ఈ దిగువభాగం గమనించ తగ్గది.

"మనం ఏది సాధించినా అది సరోజినీ చలవే! నేనీనాడు ఇలా వున్నానంటే అందుకు కొంత సరోజినీదేవి ప్రభావము కారణం. 13 సంవత్సరాల క్రిందట కాంగ్రెసు సభావేదికపై నుంచి ఆమె చేసిన ప్రసంగము నన్ను చకితుణ్ణి చేసింది. అనంతరం ఆమె ప్రసంగాలు ఎప్పుడువిన్నా దిగ్భ్రమచెందేవాణ్ణి" అతిరథ మహారథులపైన ఆమె ప్రభావం ఇటులుండగా ఇతర యువజనుల సంగతి వివరించ నక్కరలేదు.

"తామరతూండ్లలో ధవళతల్పముమీద
అల లూప హాయిగా నాడుచూ పాడుచూ
విశ్వమోహనముగా విహరించు కలహంస
నేర్పెనేమో సరోజినీదేవి! నీకు
ముద్దుమాటలతో నిద్దంపు నడల!"

— రాయప్రోలు

# కుటుంబజీవితము

'A happy family is but an earlier heaven'
—Bowring

ఆమె కుటుంబజీవితాన్నిగురించి విదేశములలోనేగాక మన దేశములోకూడా ఎరిగినవారు అరుదు. రాజకీయముగాగాని, వ్యక్తిగతంగాగాని ఆమె ఆర్భాటంలేనివ్యక్తి. అందుచేత ఆమె కుటుంబవిషయాలు ఎరిగినవారు బహుకొద్ది.

ఆమె పదహారవయేటనే, నైజాంలో ఛీఫ్ మెడికల్ ఆఫీసరుగా నున్న మేజర్ ముత్యాల గోవిందరాజులనాయుడు

గార్ని ప్రేమించి వివాహమాడ సంకల్పించెను. కాని అప్పట్లో ఆమె విద్యాభ్యాసంకొరకు విదేశాలకు వెళ్ళవల్సి వచ్చింది. విద్యాభ్యాసానంతరం ఆ నాయుడుగారినే పరిణయ మాడ ప్రతినబూనుటచే మన యుగకర్త వీరేశలింగంగారు ఆమెతండ్రి లేఖపై ఆచార్యత్వం వహించి మద్రాసులోని బ్రహ్మమందిరంలో వివాహం జరిపెను. ఈ విధంగా ఆమె ఆంధ్రుల కోడలగుట అదృష్టం. నేటికి యాభైసంవత్సరాల క్రితం, ఒక బెంగాలీ బ్రాహ్మణకన్య ఒక ఆంధ్రబ్రాహ్మణేత రుని పరిణయమాడుట ప్రశంసార్హమైనకార్యం. అనా డది అతిసాహసమైనకార్యమే అనవలసివచ్చును. ఈ వివాహం ఆమె స్వాతంత్ర్యనిరతికి, సంస్కరణకు, సంస్కృతికి, ప్రబల నిదర్శనం. ఆమె భావిజీవితమునకు పునాది. ఇది ఆమె ప్రథమ విజయం. బాల్యంలో ఆమె కవయిత్రిఅయి స్వేచ్ఛాగానమొన ర్చినట్లే ఆచరణలోకూడ స్వతంత్రమార్గము అవలంబించిన ఆదర్శవంతురాలు.

ఆమెభర్త నేడు వృద్ధుడు. మూడుకాళ్ళ ముసలి. వయసులోనేగాక, అనుభవములోనూ ఆయన అట్టివాడే. చూపుల కాయన వేదాంతివలె కనబడ్తాడుకాని ఆయన దయా దాక్షిణ్యంగల ఘనవైద్యుడు. సరోజినీదేవి బాల్యచాపల్యంచే వరించి తప్పుచేయలేదని, ఆయనతో సన్నిహితసంప ర్కముగలవారేగాక, ఆయనను ప్రథమముగా సంద ర్శించినవారుకూడా ఘంటాపథముగా చెప్పగలరు. ఖద్దరు ధారిఅయి ఆయన సదా గృహంలోనే వుంటారు. మనసరోజి నియో ఇల్లూ, వాకిలీ, పిల్లామేకా వీడి దేశదేశాంతరములలో

కోకిలగానంచేస్తూ సంచారముచేస్తూవుండేది.అయినప్పటికీ వారి దాంపత్యం ప్రేమాస్పదమైనదేగాక, ఆదర్శవంతమైనదికూడ.

ఆదంపతుః కు నల్గురు సంతానం. ప్రథమకుమారుని పేరు జై సూర్య. తండ్రివలెనే డాక్టరు. వృత్తిలోనేగాక వర్తనలో కూడ తండ్రితో తుల్యుడు.'ఈవా' అనే జర్మను స్త్రీని పరిణయ మాడి తండ్రినిమించిన తనయుడయ్యాడు. పాపం! ఆయన అర్ధాంగి ఇహలోకయాత్ర చాలించింది. ఆమె మృదుమధుర సంస్కృతులలో మునిగి అహరహమూ ఆయన తేల్తూవుంటాడు. నైజాంస్టేటులో ప్రజామన్ననలు పొందినడాక్టరు. హోమియో పతిలో పరిణతిగాంచిన ప్రసిద్ధవైద్యుడు.

ఆమె ప్రథమపుత్రిక పద్మజ. ఆకారములో అందకత్తె. సంభాషణలో సరసురాలు. సదా ఇంటివద్దనేవుంటూ గృహ కృత్యాలు నిర్వర్తిస్తూ అతిథిఅభ్యాగతి పూజచేసే ఆడబడుచు. ఆమె కేవలం గృహకృత్యాలలోనే నేర్పరియనుకోటం పొర బాటు. అరుదెంచిన అతిథికి కాఫీ ఇచ్చి మర్యాదచేయుటేకాక, రాజకీయములేకాక, సమస్తవిషయాలలోనూ, గోష్ఠిచేయ గల సహజప్రతిభావంతురాలు. పలుసార్లు, యూరపుఖండ సంచారంచేసిన లోకజ్ఞురాలు.

ఆమె ద్వితీయకుమార్తె లీలామణి ఆక్సుఫర్డువిశ్వవిద్యా లయంలో శిక్షణపొందిన విద్యావంతురాలు. సదా గ్రంథకాల క్షేపంచేస్తూ వుంటుంది. ఆమె కొంతకాలం ఒక కళాశాలలో ప్రొఫెసరుగావుండి నేడు విదేశాంగశాఖలో పనిచేయుచున్నది.

ఆమె కనిష్ఠపుత్రుడు రణధీర.ఆయన హైదరాబాదులోనూ మద్రాసులోనూ విద్యాభ్యాసముచేశాడు. మహాత్ముని పిలుపు

ననుసరించి 1921 సం॥లో విద్యకు స్వస్తి చెప్పి, 1924సం॥ వరకు తల్లిగారితో ఆసేతుహిమాచలం పర్యటనచేసి, అనంతరం నైజాంస్టేటులో ఉద్యోగిగా ఉండెను. కేవలం ఉద్యోగంతోనే కాలక్షేపము చేయలేదు. మాతృదేవత కవితాశక్తి ఆ చిన్న కుమారునిలో ఆవేశించినది. ఉరుదు, ఆంగ్లభాషలలో కవి. బీదవిద్యార్థులకు ఆయన ఎంతో అండగా వుండేవాడు. పాపం! ఆయన 1945 ఏప్రియల్ 29వ తారీఖున పరమపదించి కన్న తల్లికి ఎంతో తీరరాని దుఃఖము, కడుపు కోత పెట్టాడు.

ఆ వృద్ధదంపతులు స్వీయసంతానమువలె ప్రేమతో పెంచి పోషించిన మూడు గ్రామీణజంతువులు కలవు. ప్రిన్సు నికోలాయ్ నికోబర్, లేడీ లింకాలూపిన్, ప్రిన్సెసు నూ మాతాయ్. నికోబర్ ఆకుటుంబానికి అంగరక్షకురాలు. వారి భవనమగు సువర్ణప్రాంగణమునకు ద్వారపాలకత్వం వహించేది అదే. అద్భుతమైన తెలివితేటలు కలది ఆ శునకము. దొంగ ఎవరో, దొర ఎవరో పసిపట్టకలదు. పెద్దమనిషి ఎవరో పోలీసు ఎవరో కన్గొనగలదు. పోలీసు వస్తున్నాడంటే పరుగెత్తుకొని పోయి యజమానికి తెల్పును. పెద్దమనిషి ప్రాంగణములో ప్రవేశించగానే మొట్టమొదటగా మర్యాదచేసి భవనంలోనికి తీసుకొనిపోయేది ఆ రాకుమారుడే! ఆ ముసలినాయుడు ఆ రాకు మారుడంటే ప్రాణంవిడుస్తాడు. అవును! లోకంలో శునకం కంటె విశ్వాసంగల జంతువు వేరొకటున్నదా! మానవునకు మొదటి మిత్రము అదేకదా! ఆకారములోవలె బుద్ధిలోనూ అది పెద్దదే. అందుచేతనే అ పెద్దాయన ప్రేమకు పాత్రురా లయినది.

లేడి లింకాలూపిన్ మన సరోజినికి ప్రేమాస్పదమైన శునకం. ఆమె గవర్నరు గద్దెనెక్కినప్పుడుకూడా ఆమె దర్బారులో అన్నివేళలా ఆమెతో వుండేది. ఆమె అనుంగు నెచ్చెలి. ఆమె కవితాగుణం శునకనామకరణంలో కూడా కనిపిస్తుంది.

మరి మనూర్జాలపుమాట; అది ఆకారములో అందమైనదే కాక పరిశుభ్రమైనదికూడా. అసలు ఆజాతే అటువంటిది. అందులో నూమాతాయ్ రాకుమార్తె. ఆమెకు రాణికితగిన గమణీయత వున్నది. తెలివితేటలుకూడా అధికమే. అది సరోజినీ దేవి ప్రేమకు పాత్రురాలేకాదు; వాత్సల్యపదమైనదికూడ. ఆకవి కోకిల చంటిపిల్లనువలె ఎత్తి ముద్దాడేది తాయిని.

సరోజినీదేవి 1942 సం॥ లో మహాత్మునితో పాటు ఆగాఖాను భవనంలో కారాగారములో వుండెను. గురుసన్నిధిని వుంటూ ఆయన సేవాశుశ్రూషలలో తన్మయిఅయికూడా ఆమూర్జాలంపై మక్కువపట్టలేక నూమాతాయి రాకుమారి క్షేమసమాచారము తెలుపవలసిందని కుమార్తెకు ఒక వుత్తరం వ్రాసింది. ఆఉత్తరం తనిఖీచేసిన జైలుఅధికారి యీతాయునుగూర్చి తెలపగిలేటట్లు ఆలోచించాడు. కాని అతనికి అర్థం కాలేదు. అంతట అపరాధపరిశోధకశాఖవారు ఆలోచన చేయసాగారు. ఎవరు ఈవ్యక్తి? ఎక్కడున్నది? ఈతాయి తాయిలాండులో నున్నదా, ఇండియాలో వున్నదా? అని తమ సర్వశక్తులూ ధారపోసి అన్వేషణ చేయసాగారు. ఆఖరుకు అపరాధపరిశోధకవారు తమ అన్వేషణఫలితంగా నూమాతాయి

రాజకుమారి సువర్ణ ప్రాంగణములోని మార్గాలమని కన్గొన్నారు. నూమూతాయిరాకుమారి ఇంతచరిత్ర కలది.

సరోజినీ హాస్యాన్ని గురించి, కథలు కావల్సినన్ని వున్నవి. ఆమెకుకూడా తెలియకుండానే ఇట్టి హాస్యమును కల్పించిం దావృత్తరం.

సరోజినీదేవి సాధారణముగా ఇంటిపట్టునవుండే ఇల్లాలు కాదు. ఆమెకు ప్రపంచమే పెద్దయిల్లు. ప్రపంచప్రజలే సంతానం. అట్టి ఆమె సాధారణస్త్రీవలె ఎలా యింట్లో వుండగలదు? అందుచేత ఆమె అనవరతము ప్రపంచపర్యటన చేస్తూవుండేది.

కాని ఆమె స్వగృహములో నున్నప్పుడు, దేశదేశాంతములనుండివచ్చే అతిథులను సత్కరించి స్వయంగా వడ్డనచేసే నిగర్వచూడామణి. కవితాపాకములోవలెనే పాకశాస్త్రములో కూడ ప్రవీణురాలు. అతిథుల అభిరుచులను గ్రహించి స్వాదిష్టపదార్థాలను వండి వడ్డించుటలో అపరిమితానందంగల మాతృస్వరూపిణి. * "సరోజినిని కవయిత్రిగా వక్తగా రాజకీయవేత్తగా ఈ నాడు గవర్నరుగా చాలామంది ఎరుగుదురు. కాని ఆమెలోని మాతృహృదయం బహుకొద్దిమందికే ఎరుక. తనపిల్లలకై ఎంతజాగ్రత్త తీసుకుంటుందో, వంటలో ఎంత నేర్పరో, తనబిడ్డలు తిండితినకుండా మారాంచేస్తే, ప్రత్యేక ఫలాహారాలు చేసి, వాళ్ళను ఎట్లా ఓదారుస్తుందో, తన బిడ్డల భంగిమలను, చిరాకులనూ, పరివర్తనలనూ కనిపెట్టి, ఎలా

---

* కమలాదేవి చటోపాధ్యాయ వ్యాసం. ఆంధ్రవారపత్రిక 1949సం॥ ఫిబ్రవరి 16.

హృదయంతో లాలించి వాళ్ళను ఇట్టే నవ్వుపువ్వుల్లో తేలుస్తుందో — ఆమెలో ఎంతమాతృత్వ ముందో అది బహుకొద్ది మందికే ఎరుక."

ఆమె పాశ్చాత్యులవలె ప్రేమించి పెండ్లి చేసుకొని, ప్రాచ్యస్త్రీవలె పరిణయమాడిన పతిని పూజించింది. ఆమె ప్రాక్ప్రతీచీసభ్యతల మేలు కలయిక.

ఆమె విశ్వప్రేమ కన్నసంతానమును కడద్రోయలేదు. కన్నసంతానమును ప్రేమించినట్లే కళ్లనుగన్నసంతతినీ ప్రేమించింది. అతిథిఅభ్యాగతులను సత్కరించింది.

సరోజినీదేవి సాహిత్యక్షేత్రములో ఉత్తమశ్రేణికిచెందినట్లే గార్హస్థ్యజీవితములోను గణనకెక్కినది.

## గుణశీల స్వభావాదులు

"కొందరు గొప్పగానే జన్మిస్తారు. కొందరు గొప్పతనం సాధిస్తారు. కొందరితలలమీాద గొప్పదనం మోపబడుతుంది"

—షేక్స్పియర్

* "శ్రీమతి సరోజినీనాయుడులో ఏదో మహిమ వున్నది. ఈమె కవయిత్రిగా ఎంతగొప్పదో అంతకంటె అధికంగా దేశభక్తురాలుగను, దేశనాయకురాలుగనూ కూడా గొప్పది. మహితప్రతిభాశాలి.

పరప్రభుత్వముక్రింద భారతదేశం అనుభవిస్తున్న అవ

* కమలాదేవిచటోపాధ్యాయ, బాంబేక్రానికల్ పత్రికలో, వ్రాసిన వ్యాసానువాదం, 2-3-46 నవోదయనుండి.

మానం ఈమె సున్నితహృదయాన్ని ఎంతో బాధించినందున, ఈమె రాజకీయజీవితానికే - అంటే స్వాతంత్ర్యసంపాదనోద్యమానికే హెచ్చుప్రాధాన్య మిచ్చింది.

ఈమె గుణగణాలనూ, ప్రతిభావిశేషములనూ నిరూపణచేయటం అసాధ్యమైనకార్యం. ఈమె సర్వతోముఖప్రతిభ కల్గిన మహావ్యక్తి. అద్వితీయసామర్థ్యముకల మహిళామణి. అరుదైన తెలివితేటలుకల విదుషీమణి. అన్నిటికంటె ఈమెలో మానవత్వం అధికం, అపరిమితం. ఈమె అసాధారణమూర్తిత్వము గలదనుట నిర్వివాదాంశము. ఈమె రచించినపద్యాలు ఎంత మనోహరంగా ఉంటయో అంతకంటె హెచ్చుగా ఈమెలో ఆకర్షణవున్నది. కళావైవిధ్యము ఈమెసొమ్ము. సుప్రసిద్ధ వక్త. అతిగంభీరోపన్యాసాలు చేయడం ఈమెకు ఎంతో తేలికైనపని. ఈమె రూపమందు గొప్ప గాంభీర్య మున్నది. సరోజినీవిలువను సరిగా తెల్సుకోవలెనంటే ఈమె పద్యాలు చదవటం, ఉపన్యాసాలువినడం చాలదు. స్వయంగా చూసిన వారికే ఈమె గొప్పతనం తప్పక తెలియగలదు. అందరికీ ఆశ్చర్యముగొల్పే బహువ్యాప్తమైన జ్ఞానసంపత్తి గలదు. ఎట్టి క్లిష్ట సమస్యనైనా అతిశీఘ్రముగా గ్రహింపగలదు. సారాంశములను అతివేగంగా తేల్చగలదు.

విభిన్నభావాల నందుకొనుటలో అందెవేసిన చెయ్యి. ఈమె ఓర్పు చెప్పనలవికానిది. నేర్పు అందరెరిగినదే.

ఈమెలో విశ్వజనీనమైన సానుభూతు లున్నవి. అందుచేతనే వివిధరకాలవారికీ వివిధరీతుల ఆదరమూ అభిమానమూ. అందువల్లనే ఎక్కడైనా, ఎవరితోనైనా ఎంతో చనువుగా

వుండగలదు. అరమరా అభ్యంతరం లేక, ఎవరితోనైనా కలుపుగోలుగా కలాసగా వుండగలదు.

సరోజినీదేవికి గర్వంగాని, స్వాతిశయంగాని లేవు. తన ధోరణే తనదన్న ట్లుండదు. ఎట్టి కష్టపరిస్థితిలోనైనా ఎంత నిరుత్సాహవాతావరణములోనైనా నిరుత్సాహం పొందదు. వీగిపోవడమే ఎరుగదు. అపరిమితమైన ఉత్సాహమూ, ఉల్లాసమూ, ఆనందమూ గలవు. ఎట్టివారినైనా ఉత్సాహపర్చ గలదు. ఏ పరిసరములలోనైనా ఉల్లాసము కల్పింపగలదు. గొప్పగొప్పవిషయాలనుగురించి ప్రసంగించగల్గినట్లే సామాన్య మైనసంగతులను గురించికూడా సరసంగా సంభాషించగలదు. సంభాషణలలో చతురురాలు. ఈమెలో ఇదొకవిశేషము. అనేకరకాల విషయాలయందు శ్రద్ధనూ, ఆసక్తినీ, చూప గలదు. సంఘములో యేవిషయాన్నిగురించిన ప్రసంగములో నైనా పాల్గొనగలదు. ఈమెలో జనరంజకత్వము చాలా వున్నది. అందుచేతనే జీవితములో చాలా విజయవంత మైనది. చక్కని మాటనేర్పు, మంచి చురుకైన బుద్ధి వుండ టమేగాక యే రంగములోనైనా ఉజ్జ్వలంగా మెలగగలదు.

సరోజినీదేవి అంటే స్త్రీలందరికీ గౌరవమే. ఆదరమే. చనువే. యావన్మందికీ ఈమె అక్కగారు. ఎంతోమంది ఈమెను సొంతఅక్కకంటె ఎక్కువగా చూచుకొంటూరు. ఎవరు ఎట్టి కష్టసుఖాలుచెప్పుకున్నా ప్రేమతో, సానుభూతితో వింటుంది. వారి సమస్యల కేదో పరిష్కారం చెబుతుంది. వారికి తగిన సలహాలు యిస్తుంది. మనస్సిచ్చి విని అభిమానంతో ఆదరముతో మారుపలుకుతుంది. ఇతరుల యిబ్బందులను తన

విగా భావిస్తుంది. ఇంతటిశ్రద్ధ ఒక్క సరోజినివంటి అపరూప వ్యక్తికే సాధ్యమవును.

సరోజినీదేవికి గొప్ప ధారణ, విశేషమైన జ్ఞాపకశక్తి ఉన్నవి చూచిన ముఖాలను, విన్న పేర్లను జ్ఞాపకంవుంచుకోవడమేకాక, పరిచయముచేసుకున్నవారందరి కుటుంబాలలోని యావన్మంది పేర్లనుకూడా తెలుసుకొని, ఒక్కటైనా మరువక జ్ఞాపకంవుంచుకొని వారందరిని సలకరించడము అసాధారణవిశేషముకాదా ? ఇందువల్ల కూడా అందరికీ ఈమెఅంటే ఎంతోయిష్టం. ఇంత గొప్పవ్యక్తి, సామాన్యులైన తమ్ము గురించి ఇంత గుర్తుపెట్టుకున్నదిఅంటే ఎంతో సంతోషమూ, గర్వమూ కలుగుతుంది.

సరోజినీదేవిలో చాలా ఔదార్యము ఉన్నది. ఈమె సౌఖ్యమునకు చాలా అలవాటుపడ్డదయినా, జైళ్ళలో సౌఖ్యం జరగకపోయినా, సౌకర్యాలు కుదరకపోయినా సణుగుకోక, గొణుగుకోక సంతృప్తిగానే కాలక్షేపం చేసినది. ఆరోగ్యము చెడిపోయినా ఎంతటి బాధాకరమైన పరిసరాలలో అయినా, ఎట్టి కష్టపరిస్థితులలోనైనా ఈమె ఉల్లాసమును గోల్పోలేదు. ఇది నిజంగా ఆశ్చర్యకరము

అసంఖ్యాకమైన వ్యక్తుల జన్మదినాలు జ్ఞాపకంవుంచుకొని వారందరికీ శుభాకాంక్షలు తెలుపుతూ ఉంటుంది. అన్ని ఉత్సవసందర్భాలలోను లెక్కలేనన్ని సంస్థలకూ, సభలకూ శుభసందేశాలు వ్రాసి పంపుతూవుంటుంది. ఇందువల్లను లెక్కలేనంతమంది ప్రేమను ఈమె చూరగొన్నది.

సరోజిని ఏమి చేసినా, ఏమి పలికినా, ఏమి వ్రాసినా

అందులో కవిత్వము ఉంటుంది. ఈమె చర్య లన్నిటిలో ఈ భావనా, కళా నిండియుండును. ఈమె పద్యాలు వ్రాయడం మానివేసినా ఈమె కవి కాకపోదు. ఈమె జీవితమంతటా కవితారీతి నిండియే యున్నది. ఈమె భావప్రకటన మంతటా కవితాధోరణి యున్నది. ఏ ప్రసంగములోనైనా, ఏ సంభాషణంలోనైనా, ఏ లేఖలోనైనా, ఏ సందేశములోనైనా, ఏ ప్రకటనలోనైనా యీ కవయిత్రి కళానైపుణ్యము ప్రస్ఫుటంగానే గోచరించును. స్వాతంత్ర్యోద్యమజీవనంలోను, అందుకోసమైన అనేకత్యాగాలలోనుకూడా సరోజినీ కవితాహృదయం వెల్లడియగును. సరోజినిలో చక్కని హాస్యరసం వున్నది.

సర్వతోముఖసంపూర్ణసమ్యక్‌జీవనంగల సరోజినీదేవి సద్గుణాలను, సంస్మరించుకోవడం సంతోషప్రదమైన సంగతి గదా!

"పాలెండిపోయిన పాడియావుల చూచి
పూతపూయని గొడ్డుబోతుతీవల గాంచి
అనుతాపమాలలక ఆగ్రహజ్వాలలక
వర్షించితివి సుప్తభారతుల్ లేవ
కామాక్షివై, మహాకాళివై నీవు."

— రాయప్రోలు

# మహిళా సేవ

"యత్ర నార్యస్తు పూజ్యంతే నందంతే తత్ర దేవతాః
యత్రైతాస్తు న పూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః"

"ఎచ్చట స్త్రీలు పూజింపబడుదురో అచ్చట దేవతలు క్రీడింతురు. ఎచ్చట పూజింపబడరో అచ్చట అన్ని క్రియలూ ఫలశూన్యము లగుచున్నవి." అని మనువు నిర్వచించినాడు.

సరోజినీదేవి వివాహం తన స్వబుద్ధితో చేసుకున్నసంగతి పాఠకులకు విశదమే. ఆమె అభివృద్ధికరమైన పంథాను తానవ లంబించుటేకాక, నాటినుండి జీవితాంతమువరకు భారతస్త్రీల జాగృతికై కంకణముకట్టుకొని పనిచేసినది.

అర్ధశతాబ్దముక్రిందట అతిబాల్యవివాహములూ ఘోషా పద్ధతీ పోవాలనీ ఆమె అధికంగా ప్రచారంచేసింది.

ఆమె పెక్కువిధాల సంస్కరణోద్యమంలో పాల్గొన్నా మహిళాసంబంధమైన సంస్కరణకార్యాలలో ఆమె కృషి కొనియాడతగినది. ఆమె స్త్రీ యగుటచేతనేకాక గొప్ప కవ యిత్రిఅయి సహజచమత్కారసంభాషణచాతురి కలదిఅయి వుండుటవల్లకూడా ఆమె ప్రభావము అధికంగా వ్యాప్తిగాంచి నది. ఆమె ప్రజారంజకత్వం మహిళాసేవలో ఆమెకు అధిక మద్దతు నిచ్చింది. ఆమె ఆధునికనాగరికతాలోకములోని స్త్రీల తోనేగాక పూర్వాచారపరాయణులతోకూడ అధికసంబం ధముకల్గి పెక్కువిధాల మహిళోద్యమానికి పాటుబడింది. నేల నాలుగుచారలా ఆమె తిరిగి మహిళోద్యమవ్యాప్తికి ఉపన్యాస ములద్వారా చైతన్యము కల్గించినది. పరదాకు జన్మస్థానమైన

హైదరాబాదులోని గొప్ప గొప్ప కుటుంబాల స్త్రీలలోకూడా ఆమె చైతన్యం కల్గించింది. ఆమె కేవలం హిందూస్త్రీలతోనే గాక మహమ్మదీయ పార్శీ మొదలగు ఇతరజాతులవారితో కూడ పరిచయముకలది.

ఆమె పాశ్చాత్య విద్య అభ్యసించినా, పాశ్చాత్య దేశములలో పర్యటించినా ఆమె హృదయం పాశ్చాత్య నాగరికత పైపై మెరుగులకు లోనుకాలేదు. భారతరమణుల ఆదర్శ గుణ సంపదలతో ఆమెహృదయము నిండి నిబిడీకృతమైనది. అందు చేతనే ఆమె అనవరతమూ భారతీయసంస్కృతి ఆదర్శముల సందేశాన్నే భారతనారీలోకానికి వెల్లడించింది. భారతస్త్రీలను గురించి ఆమె చేసిన ఉపన్యాసాలు భారతమహిళల ఆదర్శ మును అధికముగా ఉగ్గడించుచున్నవి.

సరోజినీదేవి స్త్రీలకుకల్గిన అవమానమును ఎంతమాత్రమూ సహించలేని స్వభావముకలది. వంగదేశ గవర్నరు భారతస్త్రీలనుగురించి అవమానకరంగా మాట్లాడినందుకు అధిక ఆందోళనజేసి ఆయనచేత క్షమాపణ చెప్పించిన వీరాంగన.

1919 సం॥ లో స్త్రీలకు ఓటు సంపాదననిమిత్తం ఆమె అధిక ఆందోళన చేసినది. స్త్రీలకు ఓటింగుహక్కు విషయమై ఏర్పడిన సెల్‌బోరన్‌కమిటీ ఎదుట ఆమె యిచ్చిన వాఙ్మూలం అధిక ఆదరప్రదమైనది.

ఆసందర్భములో ఆమె ఇంగ్లండు కరిగి అనేక ఉపన్యాసము లిచ్చినది. పలుప్రాంతీయులు ఆమె నాహ్వానించి స్వాగత మిచ్చి సత్కరించారు. పాశ్చాత్యుల నిర్భయతా, ప్రాచ్యుల విలాసమయ శాలీనతా ఆమెలో మూర్తీభవించినవి. గొప్ప

గొప్ప ఆంగ్లేయరాజకీయవేత్తలపై ఆమె కవితాప్రభావం పడుటయేగాక, ఆమె ఖ్యాతి ఆంగ్లరాజకీయకుటుంబము వరకూ వ్యాపించినది.

1920 సం॥ లో ఆమె ఆంగ్లదేశమున కరిగి బ్రిటీషువారు పంజాబుదేశములో చేసిన దురంతములను తీవ్రముగా ఖండించినది. మాంటెగ్యూ మంత్రి వాటిని ప్రతిఘటించుటకు పూనుకొనగా సరోజినీదేవి అమృతసర్ దురంతములనుగూర్చి కాంగ్రెసు ప్రకటించిన రిపోర్టులోని భాగాలు చదివి మాంటెగ్యూ మంత్రిని మారాడకుండ చేసినది.

ఆసమయములోనే జలియన్‌వాలాబాగ్ దురంతాలను గురించి ఆల్బర్టుహాలులో ఆమె ఉపన్యసిస్తూ "నాసోదరీమణులను వివస్త్రలను చేశారు. క్రూరంగా మోదారు. ప్రాణంకన్న విలువైన మానాన్నే హరించారు" ఈవిధంగా ఆమె ఉపన్యాసం ప్రారంభించేసరికి, తమదేశంవచ్చి తమ ప్రభుత్వాన్ని ఇంత నిర్భయంగా విమర్శించటం సహించలేక అల్లరిచేసి ఆ సభను భగ్నంచేయ ప్రయత్నించిరి. అంతట ఆమె రౌద్రాకారిణియై "నోరుముయ్యండి" అని పెట్టిన కేక ఆహాలులోనేగాక రవిఅస్తమించని బ్రిటిష్‌సామ్రాజ్యమంతటా ప్రతిధ్వనించింది.

1920 ప్రాంతాల జినివాలో జరిగిన అంతర్జాతీయ మహాసభకు భారతమహిళాసభాప్రతినిధిగా అరిగి అందు ప్రముఖపాత్రవహించి భారతనారీలోకానికి అంతర్జాతీయంగా అఖండఖ్యాతి నార్జించినది.

1930 లో బొంబాయిలో జరిగిన అఖిలభారతీయ

మహిళాసభయొక్క చతుర్థసమావేశమునకు అధ్యక్షతవహించి అతిచాకచక్యముతో అందరి మన్ననలకు పాత్రమైనది.

1931 సం॥ లో ఆమెను చెరసాలనుండి విడిపించి లండనులో జరుగు రౌండుటేబులు సమావేశమునకు భారత మహిళల ప్రతినిధిగా ప్రభుత్వమువారు తీసుకొనిరి.

ఆమె గవర్నరుపదవీకాలములోకూడ మహిళలకు మహత్తరమైన సేవచేసినది.

ఆమె ఎన్నడునూ స్త్రీలకు ప్రత్యేక సదుపాయములు కోరలేదు. వారు స్వయంశక్తిపై ఆధారపడియుండవలెననే ఆమె ఉద్ఘోషించినది. భారతస్వాతంత్ర్య సంగ్రామములో పురుషులతోబాటు స్త్రీలుకూడా పోరాడుటవలన సర్వ హక్కులూ పొందగలరని ఆమె మహిళాలోకాన్ని హెచ్చరించినది. అర్థశతాబ్దిలో ఆమె మహిళాలోకంలో అనేక మార్పులు తెచ్చినది. ఆమెయొక్క సర్వతోముఖకృషివల్లనే భారతమహిళోద్యమము నేడిట్టి ఉచ్చదశకు వచ్చినది.

"మానవుడు గాంచిన యపచారము లన్నింటిలోను, స్త్రీలయెడల చేసిన యపచారము పశుప్రాయమైనది, అమానుషమైనది, పతనహేతువైనది వేరొండు గానరాదు. నా దృష్టిలో స్త్రీలు దుర్బలులు గారు. పురుషులకన్న స్త్రీలే యుదారచరితలు. నేటికినీ వారే త్యాగమూర్తులు. విశ్వాసమూ, సౌజన్యము, రెండవకంటివా డెరుగని బాధ ననుభవించుట, జ్ఞానము వారియందు మూర్తీభవించెను."

— గాంధీజీ

# ఐక్యతా కృషి

"మానవమైత్రి మంగళతంతువు
మంత్రాంశములకు మూలసూత్రమని
సత్యాగ్రహఋషి చాటిన పాఠము
యెల్లజాతులను పల్లవి పాడ
యెత్తవోయి నీజయజెండా
విప్పవోయి నీప్రియకాండా"

— రాయప్రోలు

హిందూమహమ్మదీయ మైత్రికై ఆమె అధికంగా కృషి చేసింది. ఆమె కది అత్యంతఅభిమానమైన విషయం. అందుచేత ఐక్యతాసందర్భములో అనవరతము ఆయాసమనే మాటమరచి అవసరాన్ని విడిచిపెట్టకుండా అధికకృషి చేసింది. ఆమె వ్యక్తిగతంగా మహమ్మదీయులతో కలసిమెలసి యుండుటగాంచి, మూర్ఖులేగాక, విద్యార్థికులు అనబడేవారుకూడా ఆమెను అవహేళన, అవమానం చేస్తూయుండేవారు. ఎవరు ఎన్నివిధా లన్నప్పటికీ, యేమి చేసినా, ఐక్యతాసందర్భంలో ఆమె విశ్వాసం అచంచలముగానే యుండెను. ఆమె హృదయ కుహరాంతమున తాను హిందూస్త్రీనని, హైందవ మతము యొక్క ఆధిక్యతను అణచిపెట్టుకునే యుండేది. అయినప్పటికి ఆమె మహమ్మదీయులతో వైరముప్పూనుటలో పూర్తిగా వ్యతిరేకురాలు. ఆమె హిందూమహమ్మదీయ మైత్రికి కారణం రాజకీయప్రయోజనంకాదు. అంతకంటె మహత్తరమైనది. మానవులలో భ్రాతృభావం కలిగియుండాలనే మహదాకాంక్షే

ఆమె హిందూమహమ్మదీయమైత్రికి మహాదర్శము. మహమ్మదీయుల యెడల ఆమెకుగల ప్రేమ జనించుటకు వారిమతగ్రంధములు, సాహిత్యేతిహాసములు, సభ్యతామననజనితమే. వారియెడల ఆమెకు అంధాభిమానము లేదు. మహమ్మదీయుల లోనిప్రజాస్వామిక ప్రవృత్తిపై ఆమెకు శ్రద్ధ అభిమానం అధికం. ఆకారణముచేతనే ఆమె ఇస్లాం ఆదర్శములను అధికంగా ప్రశంసించింది

మహమ్మదీయుల యెడల ఆమెకుగల ప్రేమకు కారణము స్వయంగా ఆమె ఇలా పేర్కొన్నది. నేను భరతఖండములోని ముఖ్యముస్లింనగరములో జన్మించాను. మహమ్మదీయ భూదేవిఒడిలోనే పోషింపబడ్డాను. నాజీవితములో, నాశ్రవణపుటములో ప్రథమముగాపడ్డశబ్దం అమీకుసూ్రిభాషా సంబంధమైనదే......నాబాల్యావస్థలోని సహచరులైన బాలబాలికలందరు మహమ్మదీయులే.

హిందూ మహమ్మదీయ మైత్రియందు ఆమెకుగల తత్పరతకు ఒక అంశము యిచట వివరింతును. 1911 సం॥ లో ఆమె ఆనాటిగురువగు "గోఖలే" గారితో రాజకీయవిషయములపై సంభాషణచేస్తూన్నది. ఆసందర్భములో గోఖలేగారు భావికాలములో నీవు కృషిచేయ సంకల్పించిన కార్యమేమిటి ? అని ప్రశ్నించాడు. దానికామె ఇలా సమాధాన మిచ్చింది. "ఐదేండ్లలో హిందూమహమ్మదీయమైత్రి సాధిస్తాను."అంతట గోఖలేగారు ఇలా అన్నారు. "నీవు చిన్నదానవు. కవయిత్రివి. ఆవిషయంలో అధికంగా అపేక్షిస్తున్నావు. యీ ఐక్యత నీనా జీవితములో యేర్పడజాలదు. అయినప్పటికి విశ్వాసముతో

యథాశక్తి కృషిచేస్తూవుండు.” సూక్ష్మదర్శియగు రాజర్షి యొక్క వచనం సత్యమని కాలం రుజువుచేసినది.

1913 లో లక్నోలో జరిగిన ముస్లింలీగుసభకు హిందూ మహమ్మదీయమైత్రికి—రాయబారిగా సరోజిని వెళ్ళి అందులో మహత్తరమైన ఉపన్యాసంచేసింది. దాని ప్రభావం మహమ్మదీయులపై అధికంగా పడినది.

1916 లో లక్నోలో జరిగిన హిందూముస్లింసమాఖ్యకు సరోజినీ సమధికకృషిచేసి సమాఖ్యవిజయానికి తోడ్పడింది.

1917 లో పాట్నాలో జరిగిన ఒకసభలో ఆమె యిట్లా ఉపన్యసించింది: 'మహమ్మదీయులు ఈ విశాలదేశంలో నివసించుటకు వచ్చిరిగాని యిచటనుండి దోపిడీచేసుకుపోయి, తమయిళ్ళువాకిళ్ళు నింపుకొనుటకు రాలేదు. ఈ దేశములో స్థిరనివాసముచేయుట, ఐశ్వర్యవంతముగా జేయుట ఒక నూతన సంతతిని జనింపజేయుట వారి ఉద్దేశ్యము. ఇట్టి స్థితిలో ఈ దేశ ప్రజలతో సంబంధము లేకుండా ఎట్లుందురు వారు ? పూర్వ కాలమున హిందువులతో సంబంధము లేకుండా వేరుగా ఉండిరని ప్రమాణములు ఏమైన గలవా ? ఇది తమ మాతృభూమిగా తలచుటచేత వారును యీ దేశమాత బిడ్డలే. అందుచేత మనలో కలసిపోయిరి.”

ఆమెకంటె హిందూ-మహమ్మదీయసమస్య అధికంగా అర్థముచేసుకున్నవారు లేరు. ఉభయవర్గాలవారికీ విశ్వాసపాత్రురాలు ఆమె ఒక్కతే. హిందూ-మహమ్మదీయభేదాలు అధికంగావున్నసమయంలో హిందువులలో, మహమ్మదీయుల

విశ్వాసాన్ని చూరగొన్నవ్యక్తి ఒక్క సరోజినీయే యని 'షౌక తాలి' స్పష్టపరిచాడు.

1921 లో జరిగిన బొంబాయి మతకలహాలలో ఆమె నిర్భయంగా వీధులలో తిరిగి ఉన్మత్త జనసమూహాన్ని నివారించ ప్రయత్నించింది.

1922 లో మహాత్ముడు శిక్షింపబడి కారాగృహాము న కరుగుచు భారతదేశపు ఐక్యత నీకు ఒప్పగించి నేను అరుగుచున్నానని చెప్పాడు.

ఆయన ఆదేశాన్ని సరోజినీ శిరసావహించి శక్తి వంచన లేకుండా కృషి చేసింది. ఆమె అహర్నిశము ప్రయాణముచేస్తూ దేశంలోని నాల్గుమూలలు తిరిగి ఐక్యతాసందేశాన్ని ఉద్బోధించింది.

"మతము వేరై తేను యేమోయ్ !
మనసు లొకటై మనుషు లుంటే
జాతమన్నది లేచిపెరిగీ
లోకమున రాణించునోయీ !"

— గురజాడ

# వలస భారతీయుల సేవ

'కర్మ చేయుట మనవిధి, ధర్మము; కాని మన కర్మను పూర్తిచేయుట మనచేతులలో లేదు.'

— 'టాల్ముడ్'

భారతదేశసేవేగాక, విదేశాలకు వెళ్ళిన భారతీయుల కష్టాలను నివారించుటకుగూడ సరోజినీదేవి సదా కృషిచేయుచునేయుండెను. గాంధీమహాత్ముడు, గోఖలే, శ్రీనివాసశాస్త్రి, ఆండ్రూస్, సరోజినీనాయుడు ఖండాంతర భారతీయుల కష్ట నివారణకై కృషిచేసినవారిలో ముఖ్యులు.

1917 లో నిర్బంధ కూలీచట్టానికి వ్యతిరేకంగా ఆమె అధికఆందోళన చేసినది. ఆమె అనేకసభలలో ఉపన్యాసము చేసెను. అట్టి సభలలోని ఒక ఉపన్యాసములోని కొంత భాగము.

"Let the beloved of your hearts blot out the shame that your women have suffered abroad. The words that you have heard to night must have kindled within you a raging fire. Men of India let that be the funeral pyre of the indenture system. Words from me to night ! No tears from me to night, because I am a woman and though may feel dishonour that is offered to your mothers and sisters, I feel, the dishonour that is offered to me is the dishonour to my sex.

అనగా 'విదేశాలలో మీ ప్రేమాస్పదులు పడుబాధలు

మీ నారీమతల్లులు అనుభవించు అవమానాలు మీ హృదయ రక్తముతో క్షాళిత మొనర్చండి. నేటిరాత్రి మీరు విన్న వార్త మీలో భయంకరరోషాగ్నిని ప్రజ్వరిల్లచేయును. భారతీయ పురుషపుంగవులారా! ఈ యగ్నిని, నిర్బంధ కూలీ చట్టాన్ని భస్మీపటలంచేయుటకు ఉపయోగించుడు. నేను నానోటినుండి మాటలు విన ఆశించుచున్నారా! లేదు, నా కళ్ళవెంట నీరుకార్చుకాల మిది. ఏలయన, నేను స్త్రీని. మీరు మీ మాతృదేవతలకు, సోదరీమణులకు అవమానం కలుగుచున్నట్లు భావించుచుండవచ్చును. నేనుమాత్రము ఈ అవమానం నాకు, నా స్త్రీజాతికి కలుగుచున్నట్లు భావించుచున్నాను.'

అట్లు ఆ నాడు ఉపన్యసించుటేగాక తర్వాత చాలా శోచనీయముగా త్రోసివేయబడిన ఆఫ్రికా భారతీయసమస్యకు నూతనోత్తేజం కలిగించింది.

పూనాలోని సాసూను హాస్పిటల్లో మహాత్ముడు జబ్బుస్థితిలోనుండి వలసదేశాలలోని భారతీయుల బాధలనుగురించి గుండె నీరయ్యేటట్లు ఒక ప్రకటన గావించాడు. ఈ ప్రకటనలోని దౌర్జన్యాలనుగాంచి సహజ ఆర్ద్రహృదయముగల సరోజిని మాతృహృదయం కలతనొందింది.

1923 లో తూర్పుఆఫ్రికాలోని కెన్యా భారతీయుల ఆహ్వానంమీద ఆమె అక్కడకు కరిగింది. అక్కడపరిస్థితులగాంచి పలుచోట్లకు వెళ్ళి భారతీయులకర్తవ్యాన్ని గురించి ప్రబోధించింది. ఆమె సంచారముచే చైతన్యంకలిగి, సహాయనిరాకరణము చేయుటకును, తలపన్ను ఇవ్వకుండావుండుటకును నిశ్చ

యించుకొనిరి. ఆమె ఉపన్యాసాలు వారిలో అధికఆత్మవిశ్వాసాన్ని కలిగించినవి.

కెన్యాఅనంతరము దక్షిణాఫ్రికా భారతీయులుకూడా ఆమె సహాయ మపేక్షించి ఆహ్వానించారు. అప్పుడువారు నేటాలు ప్రభుత్వఆర్డినెన్సుకు వ్యతిరేకంగా ఆందోళనచేయుచుండిరి. సరోజిని అక్కడికి వెళ్లి పలుప్రాంతాలలో సంచారము చేసి, వారిలో ఉత్సాహము వృద్ధిజేసి ఆందోళన అభివృద్ధి పంధాను చేయగలందులకు ప్రోత్సాహం కలుగజేసింది.

దక్షిణాఫ్రికాలో జనరల్ హెర్ట్జాగ్ 'భారతీయులు తమ మాతృభూమికి ఏలపోరాదు ?' అని ఆమె నడిగెను. అంతట ఆమె 'దక్షిణాఫ్రికాలోవుండే హాలండు దేశీయులు తమ మాతృభూమికి ఏలపోరాదు ?' అని వెంటనే సమాధానముచెప్పి ఆ హాలండువాసిని నోరుమూయించింది.

ఆమె కేవలం ప్రజలలో ప్రబోధంజేయుటయేగాక అధికారులతోకూడా సంభాషించింది. జనరల్ స్మట్సు కర్నల్ క్రెస్‌వెల్ మొదలగు శ్వేతాధికారులనుకూడా కలసి భారతీయుల వాదనను తెలిపినది. ఆసమయములో భారతదేశము తరఫున దక్షిణాఫ్రికాలో ఒక సందేశం ఇలా యిచ్చింది. భారతదేశము సామ్రాజ్యాంతర్గతంగా వుండుటా, వుండకపోవుటా అనునది దక్షిణాఫ్రికా భవితవ్యముమీాద ఆధారపడియున్నది.

దక్షిణాఫ్రికానుండి ఆమె రొడీషియా వెళ్లింది. అక్కడ కూడా భారతీయుల హక్కులకై అధికంగా కృషిచేసింది. 1924 లో భారతదేశము ఆమె అరుదెంచినప్పుడు ఆమెకు అపూర్వస్వాగత మీాయబడినది.

బెల్గాం కాంగ్రెసుకు దక్షిణాఫ్రికానుంచివచ్చిన భారతీయ ప్రతినిధులు యిట్లా అర్థించారు.

"We have given you our priceless Gandhiji, instead of him you send us Sarojini Devi!."

"అమూల్యమైనగాంధీజీని మేము మీకు అర్పించాము. ఆయనకు బదులు మీరు మాకు సరోజినీదేవి పంపించండి!"

1924 బెల్గాం కాంగ్రెసులో విదేశాలలోని భారతీయుల సేవ చేసినందుకు ఆమె శ్లాఘింపబడింది.

1925 సం॥ ఆమె అధ్యక్షత క్రింద కాన్పూరులో కాంగ్రెసుసభ జరిగింది. ఆమె అధ్యక్షోపన్యాసములో వలసదేశాలలోని భారతీయులకష్టనష్టాలను ఉదహరించుటేగాక ఆసభలో ఆమె విదేశాంగశాఖానిర్మాణముకూడా గావించింది.

1929 లో ఆమె తూర్పుఆఫ్రికాకూడా పోయి అచ్చట భారతీయ కాంగ్రెసుసభకు అధ్యక్షతవహించి వారి కష్టనివారణకై ప్రశంసార్హముగా పాటుబడింది.

1932 లో భారతప్రభుత్వ ప్రతినిధిగా దక్షిణాఫ్రికా వెళ్లి వారికష్టనివారణకై కృషిచేసెను.

ఒక్క మహాత్ముని మినహాయిస్తే ఖండాంతర భారతీయుల కష్టనివారణకై అధికకృషిచేసిన గౌరవం ఆమెకే దక్కుతుంది. ఈసేవలో ఆమె ఆగురుదేవుని ప్రశంసకు పాత్రురాలయినది. అంతకంటె అధికం కావలసిన దేమున్నది?

# కాంగ్రెసులో కృషి

"త్యాగాగ్నిచే పునీతముకాకుండా ఏదేశము అభ్యుదయము గాంచలేదు" — గాంధీజీ

సరోజినీదేవి బాల్యమునుండి కాంగ్రెసుతో సంబంధముగల వృద్ధనాయకురాలు. ఆమె 1905 ప్రాంతములోనే కాంగ్రెసులో మహోపన్యాసముగావించి అందరిని ఆకర్షించిన మహావక్త. నాటినుండి నేటివరకు ఎన్ని వాదోపవాదములు వచ్చినా ఎన్ని అభిప్రాయభేదాలు వచ్చినా ఆమాతృసంస్థను విడనాడలేదు.

కాంగ్రెసులో మహత్తరమైన త్యాగాలుచేసిన త్యాగధనులు, మేధావులు, సాహసులు, విప్లవవాదులు, ప్రజానాయకులు, రాజకీయవేత్తలు ఉన్నారు. అట్టి ప్రముఖులలో కొందరు కాంగ్రెసులో స్వీయాభిప్రాయములు నెగ్గకపోతే, కాంగ్రెసును విడనాడారు. మరికొందరు కాంగ్రెసును స్వాధీనము చేసికొనుటకు పార్టీలు స్థాపించారు. మరికొందరు తమ నాయకత్వంకొరకు మరొక రాజకీయపక్షాన్ని సృష్టించారు. సరోజినీదేవి జవహర్‌లాల్ నెహ్రూవలె కాంగ్రెసుయెడల గౌరవపురస్సరంగా వుంటూ కాంగ్రెసు ఎన్నడూ తప్పుచేయదు; అన్న అచంచల విశ్వాసముతో ఉన్న కాంగ్రెసు భక్తురాలు.

కాంగ్రెసునందు తాను అచంచలవిశ్వాసముతో వుండుటేగాక, అందులో చీలికలురాకుండావుండుటకు ఆమె అత్యధికకృషి చేసింది.

భారతదేశములో వివిధమతాలవారు ఐక్యతగావుండి దేశభక్తులై దేశారాధన చేయవలసిన ఆవశ్యకతను సూచిస్తూ భారత మాతృవందనమనే మహోజ్జ్వల గీతాన్ని 1915 కాంగ్రెసులో పఠించి అందరి ప్రశంసలకు పాత్రురాలైనది.

1915, 16 కాంగ్రెసులలో స్వరాజ్య తీర్మానానికి ఆమోదకురాలుగావుంటూ అఖండోపన్యాసాలు యిచ్చి అభివందనాలు గైకొన్నది.

1923 కాకినాడ కాంగ్రెసులో కెన్యాకు భారతకాంగ్రెసు ప్రతినిధిగా పంపబడినది.

1924 బెల్గాం కాంగ్రెసులో విదేశాలలోని భారతీయులకు ఆమె చేసిన సేవకు ప్రశంసపొందింది. 1925 వ కాన్పూరు కాంగ్రెసుకు ఆమె అధ్యక్షురాలుగా ఎన్నుకోబడింది. ఆమె అనంతరంగాని, ఆమె ముందుగాని, భారతనారీమణులు అట్టి గౌరవం పొందినవారు లేరు.

కాంగ్రెసుకిరీటం వజ్రములతో పొదిగినదిగాక, వాడి ముళ్ళతో పొదిగిన కిరీటమని గాంధీజీఅన్నమాట అక్షరాలా సత్యమే. అయినను కాంగ్రెసుఅధ్యక్షతకన్న అస్వతంత్రభారతములో భారతీయుడాశించగల వున్నతస్థానము గౌరవప్రదమైనది మరియొకటి లేదు. ఆంగ్లేయులకు ప్రధాన మంత్రిత్వము, అమెరికావారికి అధ్యక్షత యెట్టిదో, భారతీయులకు కాంగ్రెసుఅధ్యక్షత అట్టిది. కాంగ్రెసు భారతజాతీయ అనధికారశాసనసభ.

ఆమె అధ్యక్షోపన్యాసము కాంగ్రెసు అధ్యక్షోపన్యాసములన్నిటికంటె అతిచిన్నది. కాని అతిమధురమైనది. సంక్షి

భావము కావలెనని, భారతజాతికి భయం పోవలెనని, నిరాశ క్షమింపరాని పాపమని ఆమె ప్రబోధించింది. ఆమె ఉపన్యాసము అన్నివిధముల నూతనవికాసమును సాహసమును కల్పించెను. ఆమె మాతృశిక్షణముక్రింద కాంగ్రెసు సమైక్యభావముతో సాగిపోయినది.

ప్రవాసభారతీయులయెడల ఆమె ప్రేమ అపారము. కాన్పూరు కాంగ్రెసులో ఆమె అధ్యక్షస్థానమునుండి ప్రవాస భారతీయులకు ఒక శాఖ కాంగ్రెసులో వుండవలెనని తీర్మానం ప్రవేశపెట్టి ఏకగ్రీవంగా ఆమోదించేటట్లు చేసింది.

ఆమె కాంగ్రెసు అధ్యక్షస్థానానికి ఎన్నుకోబడగానే చేసిన ప్రకటన :—

'నేను స్త్రీని. నా కార్యక్రమముకూడా గృహకృత్యములకు సంబంధించి వినమభావపూరితముగా నుండును. భారతమాతను తన స్వగృహమందు తిరిగి గృహదేవస్థానము నలంకరింపజేయుటకే ఆ కార్యవిధాన ముద్దేశింపబడినది. ఆమె గృహయజమానురాలుగానుండి అతిథులను, అభ్యాగతులను పూజించుటకు సర్వాధికారములు గలిగియుండవలెను. కాబట్టి భారతమాతకు ప్రేమాస్పదురాలినైన పుత్రికనుగా ఆమె గృహపరిపాలనమును రాబోయేసంవత్సరము సరిగా నిర్వర్తింపవలెనని నా కోరిక. అది కష్టతరము కావచ్చును. వివిధమతముల వారునూ, వివిధతత్వములవారునూ కల ఆమె సమిష్టి కుటుంబములో కలిగే కలహములను పరిష్కరించి ఆమె బిడ్డలలో ధనికుడు, దరిద్రుడు అనే భేదములేకుండా ఎవరికి తగిన స్థానమును వారికి చూపించి ఆమె గృహావరణములోని పిల్లలను

గాని, అతిధులనుగాని, పరదేశీయులనుగాని కాపాడుటయే మన కర్తవ్యముగా భావింతును.'

ఎట్టి మహోత్కృష్ట ఆదర్శము ? స్త్రీ జనస్వభావానుగుణ్యమై వున్నది.

అధ్యక్షోపన్యాసములోని పసిడితునకలు:—

"మిత్రులారా ! మీరు నాకు గావించిన నిరుపమాన గౌరవమువలన నా మనమునందు జనించిన గాఢభావ సమ్మేళనమును వెల్లడిజేయుటకు తగిన శక్తి, సౌందర్యములుగల వాగ్జాలమును మానవభాషాసంపన్నిధానముల నన్నిటిని గాలించినను గూడ నేను బడయజాలను. భారతీయులలోను, విదేశీయులలోను, శ్రేష్ఠులగువారు పలువురు యీ 40 యేండ్లనుండియును సమర్థతతో వహించి నిర్వహించిన యీ మహోన్నత పదవి (అధ్యక్షత)కి సంబంధించిన భారమును బాధ్యతను నేడు నైపుణ్యావిరహితములగు నా బాహువులపై నిడితిరి. మీరొసర్పగల గౌరవములలో మహోన్నతమగు గౌరవమునే నాకొసరించితిరని నేను బాగుగా గ్రహించితిని. భారతనారీమణులు దేశీయములయిన భౌతిక ఆధ్యాత్మిక విషయములందు పాల్గొనుటకు పురుషులతోపాటు సమానాధికారమును కలిగియున్నారను విషయమును మనఃపూర్వకముగా నామోదించితిమని స్పష్టపరచుటకును, భారతనారీమణులపట్ల నుదారమగు గౌరవమును చూపుటకునే మీరు నన్నీపదవికి ఎన్నుకొంటిరిగాని స్వదేశమునందును విదేములందును నేనొసర్పగలిగిన అల్పసేవకు ప్రతిఫలముగా నన్నెన్నుకొనలేదనియే నేను తలచెదను. విషమ సమస్యలతోను, పరివర్తనాత్మిక ఫలితములతోను

నించియున్న యీ సమయమున మీరు నన్ను భృత్యాగ్రణినిగా నెన్నుకొనుటలో క్రొత్తగా మీరిపుడే పద్ధతిని యేర్పరచియుండలేదు. భారతదేశచరిత్ర చాటుచున్న సౌఖ్యదాయక శకములలో భారతాంగన లాక్రమించియుండిన స్థానముననే ప్రాక్తనాచారానుగుణ్యముగా నేడు మరల మీరు నా కొసంగితిరి. భారతదేశమున నారీమణులు పచనాగ్నులకును, హోమాగ్నులకును, జ్యోతిరగ్నులకునుగూడ ప్రతిబింబములును, రక్షణశీలలునై యుండిరి. మన దేశచరిత్రలను, ప్రాక్నేతిహాసములను నిరుపమాన వివేక భక్తిత్యాగములవలన ప్రకాశితములుగావించిన పతివ్రతాశిరోమణుల అకలంకసతీత్వమును విశదీకరించుటకు నేను కేవలము అనర్హురాలనను విషయమును గాఢసంతాపముతో నేను గ్రహింపగలిగియున్నను మహారణ్యముల తిరుగాడుసమయమున శ్రీసీతామహాదేవి వహించిన యత్యధికమగు జాగరూకతను వెల్లడించుటకును, నిజభర్తజీవనములతో పాటు యమదేవుని పిరుంద మృత్యుసదనమునగూడ మహాధైర్యముతో సావిత్రిదేవి యనుగమింపగలుగుటకును కారణమగు సనాతనభక్తికుండమునందలి తేజోవంతములగు ప్రజ్వలితేంధనములలో కొన్నిటినైన నేనుగూడ మీరు నాకు విధించిన యీమహోన్నతకార్యనిర్వహణార్థము కొని రాగలుగుదుననియే నమ్మెదను.

ఇటుల తనకు అధ్యక్షస్థాన మొసంగుటలో భారతీయులు చూపిన గౌరవప్రపత్తులకు కారణములు పేర్కొనుటలో ఆమె కనబర్చిన ఉన్నతభావాలు, ఆమె నిండుతనానికి నిదర్శనాలు.

అనంతరము "ఏవిధంగా మీహృదయాలను కదిలించ

గలను? మీదాస్యాన్ని, మీవిభేదాలను, మిమ్ము ఆకటికి, చలికీ, నిరాశకు, నిరంకుశత్వానికి, పాల్పడజేస్తున్న సమస్తాన్ని దహించి వేయగల నిరంతరాగ్నిశిఖలను మీలో నే నేవిధంగా ప్రదీప్తము చెయ్యగలను ?" అని ఆమె ప్రశ్నించింది.

"స్వాతంత్ర్యసమరంలో క్షమించరాని ద్రోహము నిస్సృహయే క్షంతవ్యముకాని మహాపాతకము భయమే. అని అంతకంటె దేశద్రోహం వేరేదియును; లేదు. అదిమహాపాతకము. దానికి ప్రాయశ్చిత్తమే లేదు." అని ఆమె ఆసభావేదికపై నుంచి వుత్తేజకరంగా ఉద్ఘోషించింది.

శాసనసభాప్రవేశము ఆమెకు ఇష్టంలేకపోయినా కాంగ్రెసు అంగీకరించినందున, కాంగ్రెసు విజయమునకై ఆమె 1937 లో భారతదేశమంతటా తన అనర్గళ మృదుమధుర స్వరంతో ఉపన్యసించి, అఖండవిజయం చేకూరునట్లుచేసిన కాంగ్రెసుభక్తురాలు.

కాంగ్రెసులో అంతర్జాతీయశాఖకు ఆమె అధ్యక్షురాలు.

కాంగ్రెసులో ఆమె ఏ గ్రూపుకు చెందినదికాదు. ఎన్నడును ఆమె నాయకత్వం కోరలేదు. మహాత్ముడు కాంగ్రెసులో ప్రవేశించినతర్వాత కాంగ్రెసును, మహాత్ముని, సేవించుటకు తన సర్వశక్తులను ధారపోసిన దేశభక్తురాలు.

1922 లో మహాత్ముడు శిక్షింపబడెను. గాంధీజీ కాంగ్రెసులోవున్నసమయములో కాంగ్రెసుప్రముఖులలో రెండుపక్షాలు ఏర్పడినవి. శాసనసభాప్రవేశవాదులగు స్వరాజ్యపక్షానికి దేశబంధు చిత్తరంజనుదాసు మోతిలాల్

నెహ్రూ మొదలగు కొమ్ములుతిరిగిన వారు నాయకులుగా ఉండిరి.

గాంధీజీ చూపించిన మార్గమే గణనీయమైనదని అపరివర్తనవాదుల వాదన. ఈ పక్షానికి రాజాజీ, శ్యామసుందర చక్రవర్తి, పటేల్, కొండా వెంకటప్పయ్య, పట్టాభి ప్రభృతులు నాయకులు. ఆమెకు శాసనసభాప్రవేశము సుతరాము యిష్టములేదు. మహాత్ముని మార్గమునందే అచంచల విశ్వాసముగల భక్తురాలు. అయినప్పటికీ ఆమె ఒకపక్షం వహించక యిరుపక్షాల ఐక్యతకై కృషిచేసింది.

శాసనోల్లంఘన కమిటీలో సభ్యురాలై కూడా ఆ కమిటీ రెండుపక్షాలు అయిపోయినప్పుడు ఆమె అనారోగ్యముగావుండుటచే దానిలో పాల్గొనజాలకపోయినా, సమైక్యతకై కృషిచేసింది.

కాంగ్రెసుప్రముఖులు అంతఃకలహాలలోవున్న సమయాన ఆమె యేపార్టీకిచెందకపోవుటయేగాక, అంతఃకలహాలు, వైమనస్యాలు, సమసిపోగలందులకు, అందరూకలిసి పోరాటము సాగించేందుకు నిరంతరం కృషిచేసింది.

పెద్ద పెద్ద సమస్యలలో నాయకులు కొట్టుమిట్టాడుతూ వాక్కలహాలలో దిగినప్పుడల్లా, ఆమె వారి మధ్య స్నేహాసుహృద్భావాలు చేకూర్చేది. అతిక్లిష్టసమస్యలు చర్చించే సమయములో కూడా, చతురంగామాట్లాడి, నాయకుల వ్యథిత హృదయాలకు ఆమె కొంతశాంతి దాంతియిచ్చేది.

కాంగ్రెసు కార్యవర్గములో ఆమె యించుమించు పాతిక సంవత్సరాలపాటు వుండి, కాంగ్రెసు వ్యవహారములలో ఆమె

ప్రధానపాత్ర వహించింది. అగ్రనాయకుల అందరి ప్రేమకు పాత్రురాలైనది.

కాంగ్రెసుసభలలో ఆమె హాస్యచతురతాసంభాషణము సమ్మోహజనకమై, సర్వజనశ్లాఘనీయమై వుండెడిది.

కాంగ్రెసులో వివిధభాషలలో మాట్లాడగల నేర్పు గలది. సాధారణంగా కాంగ్రెసుసభల అన్నింటిలోను, మంగళాచరణం, (కృతజ్ఞతావందనములు) చేయు బాధ్యత ఆమెదే.

సరోజినీదేవి కాంగ్రెసులో కన్నతల్లి వలె నుండి తన కోకిలకంఠంతో సర్వజనులను ఆకర్షించి సమైక్యతకై కృషి చేసిన ఐక్యతామూర్తి. కాంగ్రెసు కర్ణధారులలో ఆమె ఒకర్తె. సరోజినీదేవి నామము, కాంగ్రెసుసేవ కాంగ్రెసు చరిత్రలో అజరామరమై అలరారగలదు.

## బా పూ జీ తో ...

"నేను జ్ఞానజ్యోతిని సరిగా గ్రహించి, ఆ యాదేశమును ఆచరణకు తెచ్చితినేని ధన్యుడ నగుదును. నాతోపాటు ఏకాంత మందిరమైనను రాగలిగినేని నా కింతకంటె కావలసిన దేమియు లేదు"

— గాంధీజీ

గాంధీజీ భారతరాజకీయరంగంలో ప్రవేశించినతర్వాత ఆయనకు సహచరులు, శిష్యులు అయినవారెందరో గలరు. మహాత్ముడు మట్టిముద్దలను మహావీరులనుగా చేసిన రాజకీయ శిల్పి. భారతస్వరూపమునే తీర్చిదిద్దిన యుగపురుషుడు.

రాజాజీ, రాజేంద్రప్రసాదు, పటేలు 'గాంధీత్రిమూర్తు' లని ఖ్యాతి గాంచారు. మహాత్ముని మేధస్సు తత్వజ్ఞానము రాజాజీలోను, సేవావినయాలు రాజేంద్రబాబులోను, శక్తి కార్యదక్షతలు పటేలులోను పరిఢవిల్లినవని ఒక ప్రముఖుడు ప్రకటించాడు. ఆయనమాట అక్షరాల సత్యము.

జవహరులాల్ తన 'రాజకీయవారసుడని' గాంధీజీ దీవించుట, ఉభయుల యోగ్యతకు అనుగుణ్యముగా వున్నది.

గాంధిమహాత్ముని సరిగా తెలుసుకున్నవాడు లోకానికి తెలియజేసినవాడు, ఆయనశిష్యుడు, కార్యదర్శి, సేవకుడు తన సర్వస్వమును అర్పించి ఆయనలో లీనమైపోయిన మహాదేవదేశాయి ఒకడే.

గాంధిజీ అహింసాసిద్ధాంతాన్ని అక్షరాలా ఆచరణలో పెట్టినది సరిహద్దుగాంధి యని ఖ్యాతిగాంచిన అబ్దుల్ గఫూర్ ఖాన్.

గాంధివాదంయొక్క ఆధ్యాత్మిక తత్వమును, మూల సూత్రములను వ్యాఖ్యానము చేయుటలో మష్రువాలా, కిషోరిలాల్, వినోబాభావే విఖ్యాతులు.

మహాత్ముని వ్యాఖ్యాతలుగా ఖ్యాతిగాంచినవారు డాక్టర్ పట్టాభి, ఆచార్య కృపలానీలు.

గాంధీజీకి సన్నిహితులైన ముఖ్యులలో సరోజినీదేవి ఒకర్తె. ఆయనకు విశ్వాసపాత్రురాలైన అనుచారిణి. ఆయనచే ఆరంభింపబడిన సత్యాగ్రహసమరములోను, ఆఫ్రికా సమస్యలోను ఆయనకు కుడిభుజంగా పనిచేసి ఆయన ప్రశంసలను పొందిన ప్రసిద్ధురాలు. ఆయన పూనిన ప్రతికార్యములోను

త్రికరణశుద్ధిగా పనిచేయుటేగాక, ఇంటా, బయటా, ఉపవాస ములలోను, వృద్ధాప్యములోను జాతి జనకుని తనయవలె, తల్లివలె సాకిన సేవావ్రతురాలు.

స్త్రీలకు సహజమైన ఓర్పు ప్రేమలతో వేయికళ్ళతో కనిపెట్టుకొని మహాత్ముని పూజించుటేగాక, మహాత్ముని ఉత్తమ సంస్కృతి, హృదయంపు ప్రేమ, రాజకీయాలను అతిక్రమించిన మానవమైత్రి, ఉత్తమహాస్యం సరోజినీలో సాక్షాత్కరించినవి.

గాంధీవాదము మేధస్సంబంధమైనది కాదు. హృదయ సంబంధమైనది. విశాలహృదయుంగల సరోజిని అందులో అగ్ర గామినిగా అలరారినది. మహాత్మునివలెనే, ఆమెకును ఎవరి యెడల అసహనము, అప్రేమ లేదు. అందరియెడల ఆమెకు అనురాగమే.

మహాత్ముని కేవలం రాజకీయనాయకునిగాగాక, గురువుగా, కన్నతండ్రిగా భావించి భక్తిప్రేమలతో పూజించి సర్వసపర్యలు చేసినది సరోజినీదేవి.

మహాత్ముడు ఉపవాసముచేసినప్పుడల్లా వేయికళ్ళతో కనిపెట్టుకొనివుంటూ ఆయన ఆరోగ్యరక్షణకై పాటుపడేది. జాతి జనకుని 'నా పసిపాప ఎలా వున్నాడో?' అంటూ అతి ప్రేమతో తల్లివలె తలచి సాకింది. ఉపవాసానంతరము ప్రతి దఫా నిమ్మకాయరసము యిచ్చు భాగ్యము ఆమె అమృత హస్తమునకే దక్కినది.*

---

* ఆఖరుసారిమాత్రము ఆభాగ్యము ఆజాద్‌కు అబ్బింది.

మహాత్ముని దండియాత్రా సందర్భములోనేమి, కారాగృహములోనేమి ఆమె వెన్నంటియుండెడిది. ఆయనకు ఎట్టి అలసట, ఆయాసమూ, క్లేశమూ రాకుండా, తన శక్తియుక్తులన్నీ ఉపయోగించింది. ఆయనను పసిపాపగా ఎంచి ఆయనతో ఆడిపాడి ఆయనను ఎల్లప్పుడూ ఉల్లాసముతోను, ఉత్సాహముతోను వుండునట్లు చేసేది. కారాగృహములోకూడ ఆయన కెట్టి క్లేశము లేకుండా చేసేది. *ఆమెఅండ ఆయనకు పెట్టనికోట ! ఆమె ఆదరణ ఆయనకు అమృతసేచనం.

---

* వారు జైలులో వుండగా దీపావళిపండుగ వచ్చింది. ఆపండుగ బాగాచెయ్యాలని సరోజిని, గాంధీజీ సన్నిహితుల సంకల్పము, అందుకుగాను వారొకపన్నాగము పన్నిరి. వారందరు ఒకమాట అనుకొని గాంధిజీతో 'మీకు ఇవాళ చాలాజ్వరంగా వున్నది. కదలరాదన్నారు. ఆయనను కదలనివ్వకుండా చేసి పండుగ ఆటహాసమంతా ఆయనకు తెలియకుండా జేసుకొన్నారు. సాయంకాలం అయ్యేసరికి అనేకదీపాలు వెలిగించి, ఆప్రదేశమంతా దేదీప్యమానం అయ్యేటట్టుచేశారు. సరోజినీదేవి చక్కనిగేయం ఒకటి ఆంగ్లంలో రచించింది. మహాత్మునిపాలకుగాను వుంచిన మేకను, మేకపిల్లను గాంధిజీ వుండే గదిద్వారము వద్దనుంచి, ఆయనను అక్కడకు రప్పించారు. ఆమేకపిల్ల మెడకు సరోజినీ వ్రాసిన గీతముకట్టి, ఆహ్వానపత్రిం అందుకొండని అన్నారు అంతట మహాత్ముడు దానినిచేతపట్టాడు. ఆమేకపిల్ల వచనంగా ఇట్లావున్నది. "ఏమి మహాత్మా! నేను మేకసంతానాన్ని, నీవు పోషితపుత్రుడవు. నాకన్నతల్లిపాలు కడుపార త్రాగనివ్వకుండా, నీవు నాతల్లిపాలను తస్కరించుట తగునా? ఏమి మహాత్మా ! నీవే చెప్పు" ఇటులవ్రాసిన దానిని చదువుకొని మహాత్ముడు కడుపుబ్బ నవ్వుకొని ఆరాత్రి పాలుత్రాగక "ఈపండుగనాడు నీవే అనుభవించు" అని ఆశీర్వదించి పంపివేస్తూ, మహాత్ముడు, ఆమె దీపావళిని గురించిన ఆధ్యాత్మికతత్వాన్ని గురించి, సాంగోపాంగంగా చర్చించుకొంటూ కులాసాగా నడుస్తూ బయలుదేరారు. ఇటుల ఎన్నోవిధాల సరోజినీదేవి మహాత్ముని సంతోషసాగరములో వుంచుటకు సదా కృషి చేస్తూ వుండేది.

మహాత్ముని జన్మదినోత్సవము ఏమరకుండా కారాగారములో వుండికూడ ఉజ్జ్వలముగా చేసేది. గాంధీజీయెడల యెంత భక్తివిశ్వాసా లున్నవో అంత చనువుకూడా ఆమెకు కలదు. సత్యాగ్రహోద్యమము ప్రారంభమునుండి ఆయన సన్నిధానవర్తినియై ఉండెను.

మహాత్ముడు నొవ్వించకుండా నవ్వించుటలో గొప్ప చతురుడు. "నాలో హాస్యరసమే లేకపోయినట్లయితే ఏనాడో ఆత్మహత్య చేసుకొనేవాడ"నని ఆయన అన్నాడు. గాంధేయులగు ఆచార్యకృపలానీ, డాక్టర్ పట్టాభి, సర్దారుపటేల్ పరిహాస ప్రసిద్ధులే కాని, వారి పరిహాసములో చురుకుపా లెక్కువ. గాంధీజీవలె ఛలోక్తులను పలకగలసత్తా, సంస్కృతి ఒక్క సరోజినికే గలదు. వారి చనువుఛలోక్తులు గ్రహింపదగినవి.

ఒకసారి మహాత్ముడు ఉపవాసవ్రతము విరమించిన తర్వాత మామూలుప్రకారము నిమ్మకాయరసమిచ్చి, ఆయన దరహాసితవదనము చూచి 'పెళ్లికొడుకులాగా ఉన్నావు' అని సరోజిని పరిహాసించింది. అంతట ఆతాతయ్య 'నీవు పెళ్లి కూతురవైతే నేను పెళ్లికొడుకు కావటానికి సందేహించను' అని సరసంతో సమాధాన మిచ్చెను.

1944 అక్టోబరు 2 వ తారీఖున గాంధీజీకి 75 సంవత్సరాలు నిండినవి. అందుకుగాను దేశీయులు ఆయనకు 75 లక్షలు అర్పించాలనుకున్నారు. అంతకంటె అధికమే వసూలైనది.

ఆజన్మదినోత్సవ సందర్భములో పెద్దముత్తైదువ సరోజిని ఆయననుదుట కుంకుమబొట్టుపెట్టి, ఆప్యాయంగా తలనిమిరి, తనకణతలపై మెటికలు విరుచుకొని, చెక్కరూపంలోఉన్న

ఆనిధిని సమర్పిస్తూ, 'దీనిని నేను నీచేతి కివ్వకుండా కొంగున ముడివేసుకుపోతే నీ వేమిచేయగలవు ?' అని ఛలోక్తిగా అనే సరికి 'నీవు నిజంగా అంతపని చేయగలదానివే?' అని ఛలోక్తిగా సమాధాన మిచ్చాడు మహాత్ముడు.

హైదరాబాదునుంచి మంచిద్రాక్షపండ్లను మహాత్ముని కొరకు తెచ్చి,'నైజాం ప్రభుత్వంవారి తోటనుండి మీకొరకు ద్రాక్షపళ్లు తెచ్చాను. అది రాజద్రోహం' అన్నది సరోజిని. 'భేష్ ఆరసం అద్భుతం. ఆరసం త్రాగి నేరమునకు తగిన జరిమానా చెల్లించుకొందును.' అని మహాత్ముడు చక్కని సమాధాన మిచ్చాడు.

విద్యార్థు లొకసారి గాంధీజీని ఉపన్యసించవలసినదని కోరగా, హరిజననిధికి రెండువేలు యిస్తే ఉపన్యసిస్తా నన్నాడు. సమీపమునవున్న సరోజిని 'ఆకోమటిని ఎందుకు అడుగుతారు! కోమటి కెప్పుడూ ధనాశ హెచ్చు' అన్నది. అంతట ఒకవిద్యార్థి 'మీ రిట్లా ధనం ఆర్జించదలచుకుంటే కోటీశ్వరులు కావచ్చును' అన్నాడు. అంతట ఆమె 'నే నెన్నడూ డబ్బుకు చెయ్యిజాచను. కోమటికాబట్టి ఆయన అడిగాడు. నేనుఉత్తమబ్రాహ్మణబిడ్డను. దానం ఇవ్వడమేగాని తీసుకోవడం యెరగను.' అని సమాధాన మిచ్చింది.

గాంధీజీవద్ద యింతచనువుగా మాట్లాడగలవారు ఆమె తప్ప అన్యులు లేరనుట అతిశయోక్తి కాదు. ఆమె బాపూతో అతి చనువుగావుండే అనుగామినిమాత్రమే కాదు. ఆయన అంతరంగికసలహాదారుకూడాను.

'నేకెడ్ ఫకీర్' అనే గ్రంథంలో ప్రసిద్ధ పత్రికా రచయిత

రాబర్టు బెర్నేస్ వ్రాసిన ఒక ఉదంతము ఈ సందర్భములో వినదగినది.

ఇర్విను ప్రభువుతో సంభాషణలు జరుపుతూ గాంధీజీ ఒక విషయమై, సరోజినీదేవితో సలహా చేయాలనుకొని ఆమెకోసం వెతుకగా, ఆమె స్నానాలగదిలో వున్నదని తెలిసింది. గాంధీజీ వెంటనే ఆగదివద్దకు వెళ్ళి, తలుపుకొట్టి ఆమెతో అత్యవసరంగా మాట్లాడవలసిన విషయం వున్న దన్నాడు. కాని, ఆమె – "బాపూ...! నేను స్నానంచేస్తు న్నానుగా ... మరి ..." అని లోపలనుండియే సమాధానం చెప్పింది. కాని బాపూ "మరేం ఫరవా లేదు లే ..." అన్నాడు ... దానిపై ఆమె నవ్వుతూనే ... "నీకు ఫరవా లేకపోతే – నాకు లేదూ?" అన్నది.

చేయునది లేక గాంధీజి ఆగదివద్ద ఆలోచనలో మునిగి అలానే వుండిపోయాడు.

సరోజినీదేవి 1925 లో కాంగ్రెసు అధ్యక్షతవహించి నప్పుడు బాపూ ఆమెను ఇట్లా ప్రశంసించాడు. "కవయిత్రిగా సరోజినీదేవి ప్రపంచఖ్యాతి గాంచింది. ప్రజాసేవలో ప్రవే శించినతరువాతకూడ ఆమెపట్ల గౌరవాదరాలు తగ్గలేదు. ఆమె సర్వజనులకూ సన్నిహితురాలు. దేశంలో ఏసేవ చెయ్య టానికైనా వెనుదీయదు. సఖ్యతాసాధనే ఆమె పర మాశయం.

"ధైర్యసాహసాలు ఆమెలో మూర్తీభవించి వున్నాయి. బొంబాయిలో 1921 లో జరిగిన మతకలహాలలో నిర్భయంగా

ఆమె వీధులలో తిరిగి, ఉన్మత్త జనసమూహాన్ని నివారించ యత్నించింది"

మహాత్మునివల్ల ఇట్టి ప్రశంసలు పొందిన దేశసేవా వ్రతురాలు మన సరోజినీదేవి.

గాంధీజీ మరణానంతరం ఆకాశవాణిద్వారా ఆమె చేసిన ప్రసంగం ఒక విషాదగీతం. అందులో కొన్ని భాగాలు:— "ముప్పదియేండ్లనుండి ఆయనతో కలిసిమెలిసి వర్తించుటవల్ల ఆయన జీవితానికి మా జీవితాలు అంకితమైపోయినవి. ఆయ నను మరువలేని మా కందరకూ ఆయన మరణం వ్యక్తి గతనష్టం. మాలో కొందరు ఆయన మరణంవలన ఖండాలుగా ఛేదించబడ్డారు. ఎందువలనఅంటే మా హృదయం, మా రక్తం, మా జీవితంలోని ప్రతిఅంశం ఆయన జీవితంతో ఎడ తెగని బంధాలతో పెనవేయబడినవి......గుండెలు బాదు కొంటానికీ, దుఃఖసాగరంలో మునగటానికీ ఇది సమయం కాదు. మహాత్మాగాంధీని తిరస్కరించినవారిని 'సవాల్'చేయ టానికి కంకణధారణ చేయవలసిన కాల మిది. ఆయన ఆదర్శా లకు సజీవ సాంకేతిక చిహ్నాలం. ఆయన సైనికులం. రణ క్షేత్రంలో ఆయన ధ్వజవాహకులం. మన పతాక సత్యం. అహింస మన కవచం. రక్తపాతంలేకుండా విజయం సాధించ గల మహత్తరశక్తియొక్క ఖడ్గమే మన ఖడ్గం...మన ఆచా ర్యుని అడుగుజాడలలో మనం నడవవద్దూ? ఆయన సైనికుల మైన మనం ఆయన పోరాటాన్ని విజయవంతంచేయవద్దూ? ప్రపంచానికి మహాత్మాగాంధీ సంపూర్ణ సందేశాన్ని ప్రసా దించవద్దూ?... ఈ క్షణాన నా గద్గదస్వరం ఆలకించే ప్రపం

చముఎదుట ముప్పదియేండ్ల క్రితం మహాత్ముని సేవకు నా జీవితం అంకితంచేసుకున్నట్లు తిరిగి అదే ప్రతిజ్ఞ చేస్తున్నాను. నేనొక అల్పసైనికురాలనే కావచ్చు కాని నాతోపాటు మహాత్మునికి అత్యంత ప్రియతమశిష్యులైన నెహ్రూ, వల్లభభాయి, రాజేంద్రబాబు, భారతదేశం నలుమూలలనుంచి ఆయన కంతిమ అంజలి ఘటించడానికి వచ్చిన తదితర శిష్యులూ, మున్నగువా రందరూ వున్నారు.

"ఇంతకుపూర్వం నిరాహారదీక్షాసమయాలలో ఆయన సపర్యచేస్తూ, ఆయన క్లేశభారం తగ్గిస్తూ సన్నిహితంచేభాగ్యం లభించినప్పుడు – ఒకవేళ గాంధీజీ సేవాగ్రామములోగాని, నౌఖాలీలోగాని, మరో దూరప్రదేశంలోగాని అస్తమిస్తే ఎలాగు అక్కడికి వెళ్ళడం అని సందేహించేదాన్ని ... రాజైన ఆ పుణ్యమూర్తి గతించిన భారత రాజాధిరాజులనడుమ గంతిచడం అంత్యక్రియలు జరగడం ఎంతోసముచితం, సక్రమం......నానాయకుని, నాగురువును, నాజనకుని, ఆత్మశాంతి చెందకుండా వుండుగాక! ఆయన మరణానంతరం భారతదేశ స్వాతంత్ర్య నిజస్వరూపం సందర్శించేందుకు పునర్జన్మకలేటంత సజీవశక్తి, ఆవేశం ఆయన అస్థికలలో, ఆయన చితాభస్మంలో ఆవిర్భవించుగాక!

"జనకా! నీవు విశ్రమించకు. మాప్రతిజ్ఞాపాలనకు అవసరమైనశక్తియుక్తులను మాకు ప్రసాదించు. స్వామీ! నీవారసులమైన, నీబిడ్డలమైన, నీశిష్యులమైన, నీస్వర్ణస్వప్నరక్షకులమైన, భావిభారత సంఘాతలమైన మమ్ములను ఏమరకు.!"

గాంధీజీ జాతిజనకు డైనట్లే సరోజినీదేవి జాతిమాత.

మహాత్ముడు పాపపంకిలమైన ఈరాజకీయాలను పునీతం చేయుటకు ఋషిధర్మములగు సత్యాహింసల ప్రవేశపెట్టిన సత్యాగ్రహఋషి.

కర్కశమైన రాజకీయాలలో ప్రవేశించి మానవులు మరలవలె హృదయరహితులై ప్రవర్తించుచుండగా సరోజినీ దేవి స్వీయకళావైదగ్ధ్యం మేళవించి రాజకీయాలకు విన్నాణం తెచ్చిన కళాతపస్విని *

సోదరినివేదిత తన సర్వస్వమూ తనగురువగు వివేకానందునిసేవలో అర్పించినట్టుల, మాత (mother) అరవింద యోగి సేవకై తన జీవితాన్ని అంకితంచేసినట్టుల, సరోజినీదేవి మహాత్మునిసేవకై సర్వస్వమూ అర్పించినది.

సరోజినీదేవి జీవించీ మరణించీకూడా, ఆయన అనుగామిని అనిపించుకున్నది.

---

* 'గాంధీజీ భారతనైతికశక్తి, సరోజినీదేవి భారత కళామూర్తి' అంటూ మన సచివోత్తముడు నెహ్రూ ఆమెనుగురించి ఇట్లా ప్రసంగించాడు. "భారత జనకుడైన గాంధిమహాత్ముడు రాజకీయ వ్యవహారాలలో నీతి ప్రయుక్తం జేశాడు. సరోజినీదేవి తన కళావైదగ్ధ్యంతో మెరుగులు దిద్ది వాటికి మరింత శోభను చేకూర్చింది......సరోజినీదేవివంటి బిడ్డ ఈగడ్డపై మరొకసారి జన్మిస్తుందా ?"

# స్వాతంత్ర్య సమరంలో

"రణరంగములో మృత్యువు మోక్షపదము. జైలు స్వాతంత్ర్యకవాటము."

— గాంధీజీ

గాంధీజీ రాజకీయరంగములోకి రాకపూర్వము కాంగ్రెసు కేవలము ఒక అర్జీలసంస్థగా, వినోద ప్రదర్శనముగా వాదప్రతివాదాల సభగా మాత్రమే వుండేది. అది విద్యావంతుల ప్రయోజనముకోసమే, వారి ప్రతిభాప్రదర్శనముకోసమే అధికముగా ఉపయోగపడుతూ ఉండేది.

గాంధీజీ సత్యాగ్రహ ప్రారంభముతో కాంగ్రెసు ప్రజాసంస్థయైనది. అది పల్లెపల్లెకు ప్రాకింది. పట్నాలనుండి పల్లెలలోకూడా ఆసమావేశములు సాగుట ప్రారంభమైనవి. కాంగ్రెసు ప్రజాసంస్థేకాక పోటీప్రభుత్వముగా (పేరలల్ గవర్నమెంటు) పనిచేయసాగినది.

1929 డిశంబరు 31 అర్ధరాత్రి సమయమున లాహోరులో జరిగిన కాంగ్రెసులో సంపూర్ణస్వాతంత్ర్య తీర్మానము ఆమోదింపబడినది.

1930 జనవరి 26 వ తారీఖు సంపూర్ణ స్వాతంత్ర్య దినోత్సవముగా నిర్ణయింపబడుటచే దేశమంతటా ఆరోజున సభలు జరిపి సంపూర్ణస్వాతంత్ర్యతీర్మానము చదువబడెను. నివురుగప్పిన నిప్పువలెనున్న ప్రజల వుత్సాహపరంపరలు ఈ స్వరాజ్యోత్సవముద్వారా వ్యక్తమయ్యెను.

మార్చి మూడవ తారీఖున మహాత్మాగాంధీ రాజప్రతి నిధికి 'అల్టిమేటమ్' పంపించెను.

12 వ మార్చి తారీఖున భారతచరిత్రలోనేగాక ప్రపంచచరిత్రలో ప్రసిద్ధిగాంచిన దండియాత్రను మహాత్ముడు సాగించెను. శరీరమాత్రవైభవోపేతుడైన ఆ వామనమూర్తి బయలుదేరేసరికి భూమిఅంతా కంపించిపోయింది. జగమంతా గజగజలాడింది. ప్రపంచములోని ప్రసిద్ధ పత్రికావిలేఖరు లందరు ఆదండియాత్ర విశేషాలు వివరించుటలోనే తమ సర్వ శక్తులు ఉపయోగించారు.

తన ప్రియశిష్యులతో బయలుదేరిన గాంధీజీ ఏప్రి యల్ 6 వ తారీఖున ఉప్పుశాసనోల్లంఘన చేసెను. అంతట దేశమంతటా శాసనోల్లంఘనోద్యమము వ్యాప్తి గాంచినది. బ్రిటిషుగవర్నమెంటు దీనిని అణచుటకు రాక్షసకృత్యాలు చేయసాగింది. ఏప్రియలు 14 వ తారీఖున రాష్ట్రపతి జవహారులాలు అరెస్టుచేయబడినాడు. మన మహాత్ముని మే 5 వ తారీఖున గుజరాతులోని కరాడీగ్రామమున అర్ధరాత్రివేళ అరెస్టుచేసి యరవాడ చెరసాలకు ప్రభుత్వము గొంపోయింది.

ఇలా దేశమంతా అట్టుడికినట్లుడికిపోతున్న సమయ ములో సరోజినీదేవి ఎలా ఉపేక్షించి ఊరుకోగలదు?

దండియాత్రా సందర్భములో మహాత్ముని వెన్నుకాచే ఆమె వుండెను. గాంధీమహాత్ముని అరెస్టునుగురించి పత్రికలలో ఈవిధముగా ప్రకటించినది. "ప్రభుత్వమువారి న్యాయశాస్త్ర గ్రంథములనుండి ఒక నిరంకుశ చట్టమును పైకితీసి విచారణ లేకుండ, గాంధీని నిర్బంధించిన విధానమునుబట్టియే గాంధీ

యొక్క శక్తి సామర్థ్యములకు ప్రభుత్వమువారు చూపిన గౌరవభావము బోధపడగలదు. మహాత్ముని దుర్బల శరీరము రాతిగోడలమధ్యను, యినుప కటకటాల వెనుకను నిర్బంధింప బడినంత మాత్రమున మనకు పోయినదిలేదు. అది యేమీ ప్రాముఖ్యమైనది కానేకాదు. గాంధీ సందేశమునకును, గాంధీ మనిషికిని భేదము లేదు. ఆయన సందేశము నేడు భారతజాతి హృదయములో ప్రతిధ్వనించుచున్నది. ప్రపంచములోని యే నిరంకుశ కిరీటాధిపతులును ఆ సందేశవ్యాప్తిని నిరోధింపలేరు. దానిని నిగళములతో బంధించజాలరు. అది ప్రపంచము యొక్క కార్యకలాపములను, ఊహాపరంపరలను దిద్ది తిన్నని దారికి తీసుకొనిరాగలదు.”

పత్రికా ప్రకటనతోనే ఆమె పని పూర్తికాలేదు. అబ్బాస్ తయాబ్జి అరెస్టు అనంతరము ‘దర్శన’ ఉప్పుకొఠారుపై దాడిచేయు నాయకత్వము వహించి నడువసాగినది.

వస్తూవున్న ఆ సత్యాగ్రహ సమరనాయకురాలిని పోలీసులు వలయాకారముగా నిలబడి, అటూ ఇటూ పోనీయక నట్టనడిబజారులో, మిట్టమధ్యాహ్నకాలమున గంటలు తరబడి అలా వుంచారు. అన్నపానీయములుకూడా అందనియ్యకుండా చేశారు. “అయినాసరే ప్రళయం వచ్చే వరకూ నేను యిక్కడే కూర్చుంటాను. మీరు కూర్చొనగలరా ?” అని ఆమె వారిని నవ్వుతూ ప్రశ్నించినది. పోలీసులు ఆమె సత్యాగ్రహాన్ని ఎదుర్కొని అపజయము గాంచారు. మే 16 వ తారీఖున ఆమెను అరెస్టు చేయక తప్పినదికాదు.

ఆమెను అరెస్టుచేయడమంటే, బ్రిటిషు గవర్న మెంటు భారతస్త్రీలను సవాల్ చేసినదన్నమాట. యుగయుగాల నుండి ఉపేక్షింపబడిన నారీలోకము బ్రిటిషువారి సవాల్‌ను నగుమోముతో స్వీకరించి, కుంకుమపువ్వు వస్త్రధారిణులై దీక్షాకంకణము దాల్చి సర్వత్యాగాలు చేయుటకు సంసిద్ధులై కదనక్షేత్రములో కాల్లుపెట్టారు.

గాంధీజీచే ప్రారంభింపబడిన సత్యాగ్రహసమరములో సరోజినీదేవి, ప్రేరణ ఉదాహరణలద్వారా పర్దా పటాపంచలై స్వాతంత్ర్యసమరరంగంలో ప్రవేశించుటద్వారా అనేక మహత్తరకార్యాలు సాధించుటకు మహిళలు పూనుకున్నారు.

1932 లో కూడా సత్యాగ్రహసమరములో అట్టి సాహసకార్యమే జేసి ప్రభుత్వాధిక్యము పొందినది.

ద్వితీయ ప్రపంచ సంగ్రామకాలములో మసిపూసి మారేడుకాయ జేయాలనే ఉద్దేశముతో బ్రిటిషుప్రభుత్వము 'క్రిప్సు' అనే గారడివానిని పంపింది. ఆ గారడివాని గమ్మత్తు అంతా గాంధీజీ గ్రహించుటచేత 'క్రిప్సు' రాయబారమనే తంతు విఫలమైపోయినది. కన్నేల్వేటివుల కపటనాటకములు సాగలేదు.

అంతట 1942 ఆగస్టు 7, 8 తేదీలలో బొంబాయిలో అఖిలభారతకాంగ్రెసుసంఘం ప్రసిద్ధమైన 'క్విటిండియా తీర్మానాన్ని' ఆమోదించింది. బ్రిటిషుప్రభుత్వము కాంగ్రెసు కార్యవర్గసభ్యులందరిని, గాంధీజీనికూడా ముందుగానే జాగ్రత్తపడి నిర్బంధించినది. అంతటితో ఆ తీర్మానము నిష్ప్రయోజనమగునని గవర్నమెంటు గ్రహించింది. నాయ

కులను నిర్బంధించుటతో ప్రజల ఆవేశము అధికమైనది. ప్రజలే విప్లవాన్ని సాగింపసాగారు. ఆగష్టు మహావిప్లవము భారత స్వాతంత్ర్యసమరచరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపబడదగినది.

1857 లో జరిగిన స్వాతంత్ర్యసమరము, కేవలము సైనికులతో ప్రారంభింపబడి సైనికులతోనే అంత్యము కాబడింది. ఈ ఆగస్టు విప్లవము, ప్రజావిప్లవము ప్రచండమారుతమువలె భారతదేశమంతటా వ్యాపించి యిది ప్రభుత్వాన్ని తుట్టతుదకు కాళ్ళబేరానికి రప్పించినది. "ఆగస్టువిప్లవము లేకపోతే మనకు స్వాతంత్ర్యమే లేదు" అన్నాడు జవహర్‌లాల్.

ఈ ఆగస్టువిప్లవములోకూడా అనారోగ్యదశలో వుండికూడా ఆమె కారాగృహమున కేగి తన విధ్యుక్తధర్మము నెరవేర్చినది. 1943 లో అనారోగ్యకారణముచేత విడుదలచెయ్యబడినది. భారతదేశపు పునర్జాగరణ కార్యకలాపము లన్నిటిలో ఆమెకు అత్యధికసంబంధ మున్నది. సరోజినీదేవి సదా అగ్రభాగమున వుంటూ యితరులను నడిపిస్తూ వచ్చినది.

స్వాతంత్ర్యసమరములోనేమి, పదవీనిర్వాహణలోనేమి స్త్రీలు పురుషుల కెంతమాత్రము తీసిపోరని వారికిగల కౌశలము అనన్యమని సరోజినీదేవి నిరూపించినది.

మహాత్ముడు మనకండ్లయెదుట మహత్తరమైన అనేక మార్పులను కలుగజేశాడు. హంసతూలికాతల్పముప తూగుటుయ్యాలలో ఊగు కుసుమశరీరలను కర్కశారణ్యములకు పంపెను. మదపుటేనుగుల నెక్కి మదాంధతచే మహీచక్రము మీాటుమహారాజులంతటివాని పాదచారులుగ నొనర్చెను

బంగారు రేకులు భుజించు భాగ్యవంతులను గంజిపాలుచేసి వైచెను. బాలచంద్రప్రభల భాసిల్లు బాల భారతులకు బూడిద పూసి కౌపీనము లిప్పించెను. చీని చీనాంబరములు బరువైనవి అని భావించు భామినీమణులచే నారచీరలనుబోలు మోటు ఖద్దరును గట్టించెను.

బాపూజీబోధలవల్ల దేశంకొరకు ప్రాణములను పుష్పములవలె అర్పించు మహాత్యాగులు బయలుదేరారు. కర్పూరము స్వరూపనాశనము చేసుకొన్నప్పుడే గదా తేజోరూపము నొందగల్గుట ? స్వాతంత్ర్యజ్యోతి ప్రసన్నమగుటకు, కర్పూర నీరాజనమెత్తుటకు, అర్హత ఈభారతజాతికే, యీభీష్మసంతతికే కలదన్నసంగతి ప్రపంచముయెదుట ఋజువైనది.

ఇంతేగాదు. (I will spread out the freedom of India in jails.) భారత స్వాతంత్ర్యము కారాగృహకవాటాల ద్వారానే సాధించెదనన్న మహాత్ముని ప్రవచనము అక్షరాలా సత్యమైనది.

మహాత్ముని – సరోజినీల సమకాలికులుగా జన్మించుట మన భాగ్యము. వారి వారసులముగా వర్ధిల్లుటకు ప్రమాణము స్వీకరించి, మనం తరించి ఇతరులను తరింపచేయుదుముగాక !

# ఆంధ్రస్త్రీలకు సందేశము

1945 సం॥ జనవరి 17 వ తేదీన ఆంధ్ర మహిళా జాతీయ విద్యా మహాసభా ప్రారంభములో ఆమె చేసిన ఉపన్యాసములోని కొన్ని భాగాలు.

"సరియైన తెలుగులో నేను మాట్లాడలేను. కనుక ఇంగ్లీషులో ప్రసంగిస్తున్నందులకు క్షమించండి.

"మాది నిజమైన తెలంగాణా. నైజాము ప్రాంతములో ఎక్కువభాగం తెలుగునాడే. మీరందరూ, (మద్రాసులో వుండే ఆంధ్రులు) నిజమైన ఆంధ్రభూమిలో నివసించుటలేదు. ఆంధ్రుల పూర్వచరిత్ర, ప్రసిద్ధికెక్కిన ఆంధ్రవంశజుల చరిత్ర అంతా తెలంగాణాకు సంబంధించియున్నది. ఆంధ్రుల గొప్పతనాన్ని తెలుసుకోవాలంటే ఆ నాటి శిలాశాసనములు పరిశీలిస్తే అర్థమవుతుంది. వరంగలు మొదలైన తెలంగాణా ప్రాంతాలలో జాగ్రత్త చేయబడిన శిలాశాసనములు చూస్తే ఆంధ్రుల కీర్తి బోధపడుతుంది.

ఆంధ్ర స్త్రీల కర్తవ్యము

"పెద్దపెద్ద డిగ్రీలు కల్గిన విద్యావంతులను చూస్తే నాకు భయంవేస్తుంది. వాళ్ళముందు నాకేమీ తెలియదని అనిపిస్తుంది (నవ్వు). కాని విద్య, విజ్ఞానము ఇవి ఆదర్శాలు కావు. విద్యకు విజ్ఞానానికి వ్యత్యాసం ఉంది. విద్యద్వారా విజ్ఞానం సంపాదించినపుడే ఆ విద్యకు విలువ ఉంది. అయితే విజ్ఞానం అంటే యేమిటి? జీవిత దృక్పథాన్ని, ఇతరప్రజలతో, లేక ఇతరసంఘాలతో ఉండవలసిన సంబంధాలను నిర్ణ

యించేదే విజ్ఞానం. ఆంధ్రస్త్రీలుగా మీరు ఈ విజ్ఞాన మార్గములో మీపాత్రను నిర్వహించవలసియున్నది. ఆంధ్రులు కీర్తిగడించినవారు. ఆంధ్రనాగరికత గొప్పది. నిజమే కాని దక్షిణఇండియాకంతటికీ తామే గొప్పవారమని అనుకొనుట పొరపాటు.

"మీ ప్రాచీన సంప్రదాయాలను పెంపొందించుకొంటూ, అభివృద్ధిమార్గాన నడవాలంటే మీ యిరుగు పొరుగు ప్రాంతాలలోని స్త్రీలందరితో స్నేహవైజ్ఞానిక సంబంధాలు వృద్ధిచేసుకోవాలి. ఇరుగుపొరుగు స్నేహసహకారాల ప్రశ్న అంటే సామాన్యమైన విషయము కాదు. ప్రపంచాన్నంతనూ నేడు ఎదుర్కొంటున్న పెద్ద సమస్య యిదే.

### సత్సాంప్రదాయాలన్నీ మనకు బలం

"ఇండియాలో ఒక చిన్న భూభాగంలోగల సమస్యలే పెద్దవై ప్రపంచసమస్యలుగా పరిణమిస్తున్నాయి. నిజానికి నేడు ప్రపంచంలో జరుగుతున్న భయంకర రక్తపాతానికి కారణం ఏమిటి? ఇరుగుపొరుగువారిని సోదరప్రజలుగా గుర్తించలేకపోవుటయే. మనతోపాటు ఇతరులకుకూడా సమాన హక్కులు, బాధ్యతలు గలవని గుర్తించలేకపోవుటయే కారణము. ఒండొరుల హక్కులను పరస్పరంగా గుర్తించినప్పుడే, మానవాభివృద్ధి కవసరమైన సమాధానం కుదిరి మానవ నాగరికత అడ్డంకులులేకుండా ప్రవహిస్తుంది.

"అందువల్ల ఈఆశయాన్ని మనస్సులో పెట్టుకొని మీప్రాంతములో మీరుచేయవలసిన ప్రయత్నాలను ప్రారంభించండి. మీబిడ్డలు, మీరు, స్త్రీపురుషు లందరూ తిరిగి

భారతీయులుగా జీవించడం అలవరచుకోండి. విదేశవిజ్ఞాన సంపర్కంవల్ల భారతీయచైతన్యం మనలో నశించింది. భారతీయ చైతన్యం, భారతీయవిజ్ఞానం అంటే దేవుడిగుడికి వెళ్లుట, కట్నాలు, నగలు, చీరెలు, అందచందాలు, కుంకుమ కాదు సుమా! భారతీయవిజ్ఞానమంటే తరతరాలనుంచీ కాపాడ బడిన భారతీయ సత్సాంప్రదాయాలే.

"నేను, నాతోపాటు ఇక్కడికివచ్చిన ప్రజాసేవకులం అందరం ముసలివారైపోయినాం. పళ్లుఅన్నీ ఊడిపోయినాయి. మారోజులు అయిపోయినవి. మీరందరూ యువతులు, భవి ష్యత్తూ అంతా మీదే. స్వాతంత్ర్యము రానున్నది. మీరు సాగిపోవలసిన బాట సులభమైనదికాదు. అందువల్ల మీరం దరూ దేశస్వాతంత్ర్య పోరాటములో సైనికులుగా చేరండి. మానవులందరికీ సమానఅవకాశాలు యిచ్చే స్వాతంత్ర్యం కొరకై ప్రజాసేవలో నిమగ్నులై ధైర్యంతో పోరాడి మన జాతీయవాంఛను సాధించండి.

మహమ్మదు ప్రవక్తకు మార్గం చూపిన దెవరు?

"మహమ్మద్ ప్రవక్త జీవితాన్ని చూడండి. దేవుడు మహమ్మదును వుద్దేశించి సత్యదూతగా వుండమని ఆజ్ఞాపించిన పుడు మహమ్మద్ నమ్మలేదు. వణికి తత్తరపోయినాడు. కాని యింటికి వెళ్ళగానే ఆయన భార్య గాభరాపడవద్దని వారించి ధైర్యం చెప్పింది. మహమ్మద్‌కు శిష్యత్వం వహించుటకు ప్రథమంలో తానే ముందుకి వచ్చింది. ఆవిధంగా మహమ్మద్ తన సందేశాన్ని మానవసౌభ్రాతృత్వాన్ని ప్రపంచానికి చాటగల్గాడు. స్త్రీ పురుషుడికి ధైర్యంయిచ్చి అండగా నిల

బడింది. దాని ఫలితంగా ఇస్లామ్‌మతం ప్రపంచమంతటా వ్యాపించింది. ఇది కట్టుకథ కాదు. చరిత్రలో జరిగిన యథార్థ ఘటన. ఆ ఒక అరబ్బీ స్త్రీ మహమ్మద్ ప్రవక్తకు వంచేసిందో, ఈనాడు ప్రపంచములో అసంఖ్యాకమైన మహిళలు అదే చేస్తున్నారు. ఎప్పుడో ఒకప్పుడైనా తనపద్ధతి, కార్యభారాన్ని నిర్వహించుటలో స్త్రీ ధైర్యం ఇవ్వలేదని ఏపురుషుడు చెప్పగలడు ?

### విశాల దృక్పథం అవసరం

"కాని చిన్న చిన్న విషయాలలోనూ రాజకీయ ఘర్షణలలోనూ, స్త్రీలు కూడా అప్పుడప్పుడు పాల్గొనుట జరుగుతోంది. ఈ విభేదాలలోనూ, తగాదాలతోను కాలాన్ని వ్యర్థం చేయవద్దు.

"సంకుచిత జాతీయ హద్దులను వదలి, విశాలమైన అంతర్జాతీయ దృక్పథంతో మనజాతీయ జీవనాన్ని అభివృద్ధి చేసుకునే సమయం వచ్చింది. అందువల్ల ఈభేదాలను, తగాదాలను కట్టిపెట్టవలసియున్నదని వేరుగా చెప్పనవసరము లేదు."

# ప్రాచ్యపరిషత్తులో ప్రవచనము

"భారతభూమి నా మాతృదేవత. నా సర్వస్వము ఆమె పెట్టిన భిక్షయే. ప్రపంచమున కామె ఒక ఉత్కృష్టసందేశమును గొంపోవనున్నది. యూరపుదేశము ఆమెను గుడ్డిగా అనుకరింపజాలదు"

— గాంధీజీ

ఆసియా ప్రపంచానికి జ్ఞానభిక్షపెట్టింది. ప్రవక్తలందరూ ఆసియావాసులే. కాని ఆసియాఖండం అనంతరం అవనతిచెందినది. అనేక కారణాలవల్ల యూరపుది పైచేయి అయింది. అదే ప్రపంచాన్ని కొంతకాలంనుండి పాలిస్తున్నది. నేడు ఒక రష్యా మినహా మిగతా యూరోపు రెండుభాగాలై పతనం అవుతూ అమెరికా పెత్తనంకిందకు వచ్చింది.

జపాను రష్యాను జయించుటచేతను, పాశ్చాత్య ప్రపంచంతోపాటు అది అన్నివిధాల అభివృద్ధిచెందుటవల్లను ఆసియాలో చైతన్యం కలిగినది. అభివృద్ధిచెందిన జపాను, ఆసియా అభివృద్ధికి ఈషణ్మాత్రం పనిచేయకపోగా, ఆసియాపై పెత్తనం చేయడానికి ప్రయత్నించింది. గతయుద్ధములో దాని ఆశలన్నీ నిరాశలయి, అమెరికా అధీనమైనది.

చైనా ఆసియాలో పెద్దదైనప్పటికి, స్వాతంత్ర్యము పొందినను ఆసియా సమైక్యతకు తోడ్పడలేకపోగా, అంతర్యుద్ధాలకు, సామ్రాజ్యవాదుల కుట్రలకు, లోనై బాధలనుభవిస్తూ వుండవలసివచ్చింది.

ఇక ఇండియా ఆంగ్లేయుల కుతంత్రాలవల్ల రెండు భాగాలుగా విభజింపబడినది. అయినప్పటికి దాని స్వాతంత్ర్య పోరాటమువలననే బర్మా, సింహళములుకూడా స్వాతంత్ర్యం పొందినవి. స్వతంత్రభారతం ఆసియా సమైక్యతకై సర్వవిధాలా కృషిచేయ సంకల్పించినది. దానికి జవహర్‌లాల్ సారథ్యము వహించ మహాత్ముడు, సరోజినీ అండగా నిల్చారు.

1947 మార్చి 23 నుండి ఏప్రియల్ 2 వ తేదీవరకు ఢిల్లీకి నాలుగుమైళ్ళలో వున్న, పురాణఖిల్లాలో ఆసియా ఖండపు మాతృమూర్తి సరోజినీదేవి అధ్యక్షతక్రింద సభ జరిగింది. నెహ్రూప్రారంభోపన్యాసము, అంతిమోపన్యాసము కూడా చేశాడు. తుదిరోజున మహాత్ముడు సందేశ మిచ్చాడు.

ఈసభకు యర్రసముద్రమునుండి, పసిఫిక్ మహాసముద్రము వరకుగల ఆసియాఖండరాజ్యాలనుండి (32 రాజ్యములు) రెండు వందల యాభైకిపైగా ప్రతినిధులు, 1000 కు పైగా పరిశీలకులు, ప్రేక్షకులు వచ్చారు. వివిధదేశాల ప్రతినిధులు ప్రతి రోజు ఈ సభకు ఒక్కొక్కరుగా అధ్యక్షత వహించేవారు.

భారతకోకిల తన సహజ కవితాధోరణిలో శ్రావ్యంగా వుపన్యసిస్తూ, 'ఆసియా ప్రజలు ఐకమత్యంగా వుండగలరని సమావేశంవారు తెలుస్తూయున్నారని ఆ విధంగా ప్రమాణము గైకొనవలసినద'ని చెప్పి యిలా అన్నది.

" ప్రపంచ అశాంతినుండి, పీడనుండి, మృత్యుముఖం నుండి మోక్షం పొందడానికై ఆసియాప్రజలు ఐకమత్యంగా వుండటము అవుసరము.

"మన ప్రాచీన విభవోజ్జ్వలస్థానాన్ని స్మరణకు తెచ్చుకోవాలి. ఆసియాఖండములో శాంతిస్థాపనతోపాటు ప్రపంచానికి వెలుగుబాటలు నిర్మిద్దామని మిమ్ముల ఆహ్వానించాము.

"ప్రపంచ ప్రజలమధ్య క్రోధావేశాలద్వారా కాక, పరస్పర స్నేహాభిమాన, సహనాలద్వారా ప్రపంచానికి క్షేమం కలదని మహాత్మగాంధి (హర్షధ్వానులు) మనకు ప్రబోధించాడు. ఇది ఆసియాయొక్క ప్రాచీనసందేశమేగాని, నూతనసందేశం గాదు.

"ఆసియాఖండ దేశాలలో విజ్ఞానసంస్కృతులలో భిన్నత్వాలు వున్నా, అవి మానవసర్వతోముఖవికాసానికి తోడ్పడుతూ, ఐక్యతకు సాధనభూతములు కాగలవని నేను విశ్వసిస్తూయున్నాను. ఇదే పండితనెహ్రూ ఆశించేది. ఇదే మహాత్మ గాంధీ ఆశించేదికూడా !"

శ్రీ సరోజినీనాయుడు అఖిలఆసియా మహాసభ కడపటి సమావేశంలో ఉపసంహారోపన్యాసం చేస్తూ ప్రతినిధులను "బిడ్డలారా సోదర సోదరీమణులారా !" అని సంబోధించి "శతాబ్దాల తరబడి మన నిధి నిక్షేపాలను వదలికొని పైనుంచి వచ్చిన అనుకరణలకొరకు ప్రాకులాడుతూ వచ్చాము. నేడింక మనకు చైతన్యోదయమైనది! మనం పునర్జన్ములమైనాము. లేవండి. దీర్ఘరాత్రి గడిచిపోయింది. ప్రాతః ప్రాంగణంవైపు పురోగమించండి" అని హెచ్చరించింది.

శ్రీమతి సరోజినీనాయుడు ఇంకా యిలాఅన్నది :

"ఇంతమంది ప్రతినిధుల ఉపన్యాసాలలోను, ఒకరికష్ట సుఖాలను వొకరు అర్థంచేసుకోవాలని, అన్యోన్యమైత్రి అభి

వృద్ధి చేసుకోవాలని, పరస్పర సహకారంకోసం పాటుబడాలని స్వాతంత్ర్య సమైక్య ఆసియా సంస్థాపించబడాలని, ఒకేఒక ప్రబల మైన వాంఛ ప్రతిధ్వనించింది. (హర్షధ్వనులు) ప్రాచీన హిందూ సామ్రాజ్య హృదయస్థానమైన యీ ఢిల్లీలో మనం నేడు నూతనసౌభ్రాతృత్వప్రపంచాన్ని సంస్థాపించు కొన్నాము. ఈనూతనవ్యవస్థ సర్వాధికారాన్ని ఏదోఒక వర్గానికి కట్టబెట్టజూపే సామ్రాజ్యం కాదు. ఇదొక స్వతంత్ర్యప్రజలసమాఖ్య. దీనిలోని వ్యక్తులందరు సమానమైనహోదాతో సంచరిస్తారు. ఇక్కడ నాయకులు, అనుచరులు అనే తారతమ్యం లేదు. పునరుజ్జీవన మహత్తర కార్యక్రమంలో అందరు సోదరులవలె కృషి చేస్తారు.

"యూరపు అమెరికాలు, సంస్కృతికి, శాస్త్రవిజ్ఞానానికి కార్యదీక్షాదక్షతలకు ఆలవాలములని పండిట్ నెహ్రూ అన్నాడు. ఇటీవలనే పైకివచ్చిన ఆఖండాలకు ఆగౌరవందక్కిన మాట నిజమే. కాని అమర్త్యప్రాచ్యఖండవాసులమైన మనమో? కాలం పుట్టినప్పటినుండి మనం యిక్కడ వసిస్తున్నాము. కాలాంతంవరకు మనం యిక్కడే శాశ్వతంగా వుండబోతున్నాము. మనం ప్రపంచానికొక సందేశం యివ్వవలసి యున్నది. అయితే పండిట్ నెహ్రూచెప్పినట్లు, మనసందేశం ఏమిటో మనం ముందు అర్థం చేసుకొందాము.

మనకు పునర్జన్మ కలిగింది

"శతాబ్దాల తరబడి యీప్రాచ్య సందేశం విస్మరించబడినది. మనం విజాతీయ దేవతలను కొలిచాం. మనం మనకు వున్న నిధినిక్షేపాలను వదలిపెట్టుకొని పైనుంచి వచ్చిన అను

కరణలకొరకు ప్రాకులాడాము. కాని నేడో? మనకు తిరిగి చైతన్యోదయ మైనది. విశేషకష్టనష్టాలనే మూసలలో మనం కరిగి కరిగి నిర్మలతప్త కాంచనసన్నిభులమై యిప్పుడు పునర్జన్మను పొందాము. నేడు ఆసియా స్వర్ణమయమయింది. పర్వత పంక్తుల నధిరోహించి, మేఘమండలాల నతిక్రమించి, మహా సముద్రాలను తరించి, దూరదూరాలనుంచి మన చిత్త శుద్ధిపై విశ్వాసం వుంచి యిక్కడకు వచ్చిన యీ సోదరులందరు తమసుహృద్భావం అనే దివ్యసందేశం మనకు తీసుకు వచ్చారు. మన కింతకంటె వేరే ఏమి కావాలి?

"ప్రపంచ దీపికను పునః ప్రజ్వలింపజేసే కర్తవ్యం భారత దేశానిదే అని వీరంతా గ్రహించారు. (హర్షధ్వానులు)

"రెండేళ్ళ పిమ్మట యీ మహాసభను మనం చైనాలో జరపబోతున్నాం. ఈమహాసభ వచ్చేసమావేశం తమ దేశంలో జరపవలసింది అని చైనాప్రతినిధి ఆహ్వానించగానే 'విజ్ఞాన సముపార్జనార్థం (దూరమని యెంచక) చైనావరకు అయినా సరే వెళ్లు' అన్న మహమ్మద్ ప్రవక్త సుభాషితం నాకు జ్ఞప్తికి వచ్చింది. విజ్ఞాన వివేకాల అన్వేషణార్థం మనం చైనా వెళ్ళబోతున్నాం. నేడిక్కడకువచ్చిన వారందరు తిరిగి రేపు చైనాలో కలుసుకుంటారు. అంటే విధిచక్రానికి మనం మళ్ళీ చలనం కలిగించామన్న మాట (హర్షధ్వానులు). కనుక భావికాలంలో ఇప్పుడు మాట్లాడుతున్న నేను కాలధర్మం పొందినా, ఇక్కడ కూర్చున్న మీరంతా గతించినా, నేడు మనం ఆచరించిన యీసత్కార్యం అవాంతరాల నన్నిటిని గడచి శాశ్వతమై నిలిచిపోతుంది. ఇదే స్వాతంత్ర్య ప్రియులైన వారికి ప్రపం

చములో సమత్వం, సౌభ్రాతృత్వం, ప్రేమ వుండాలని వాం ఛించే వారికి ధ్రువనక్షత్రమై మార్గదర్శకమౌతుంది.

## గాంధీ సందేశాన్ని పాలించండి

గాంధిమహాత్ముని సందేశాన్ని గురించి ముచ్చటిస్తూ సరోజినీదేవి ఇలా అన్నది. "సత్యప్రేమాన్వేషణుడైన మహా పురుషుని పెదవులనుంచి వెలువడ్డ పవిత్ర సందేశాన్ని మీరు విన్నారు. బెంగాల్, బీహార్‌లలో హృదయవిదారకమైన బాధలకు గురియైన ప్రజలకు అనునయించే నిమిత్తం విషాద యాత్ర సాగిస్తూ, ఆయన అలసి నేడు దుర్బలుడై వున్నాడు. కాని గాంధీజీ శరీరం దుర్బలమైనా కరచరణాలు అలసిపో యినా అవ్యక్తమైన వృద్ధకంఠస్వరముతో 'ప్రేమతో క్షమించు, ప్రేమతో నిర్మాణంచెయ్యి, ప్రేమించి స్వాతంత్ర్యపారంచూడు' అని వచిస్తున్నాడు. బిడ్డలారా! సోదరసోదరీమణులారా! ఇదే భారతదేశ సందేశం. గాంధీజీ యిచ్చిన యీపవిత్ర సందే శాన్ని మీ దేశాలకు తీసుకువెళ్ళండి. (హర్షధ్వనులు)

"భారతదేశాన్ని ఆవరించివున్న దీర్ఘనిశాంధకారం పటాపంచలైపోతున్నది. మేము ఇదంతా అనుభవించవలసిందే అని నమ్ముతూ వచ్చాము మేము ఎల్లప్పుడూ, బానిసత్వంలో వుండడమే, ఇతరుల అధికార మదానికి గురియై ఇక్కట్ల ననుభవిస్తూ పీడించబడడమే మాకు విధివిధానమని విశ్వసిస్తూ వచ్చాము. కాని ఆకాలం గడిచినది. ఈ క్షణంనుంచి మేము దానిని తరిస్తున్నాము. సోదర ఆసియావాసులారా! బంధు మిత్రులారా! లేవండి! అంధకార మంతరించిందని జ్ఞప్తియం

దుంచుకొనండి. స్త్రీపురుషులమంతా కలసి ప్రాతఃప్రాంగణం వైపు పురోగమింతుముగాక! (దీర్ఘహర్షధ్వానులు)"

సరోజినీదేవి భావించినట్లే భారతదేశము స్వాతంత్ర్యం పొందుటయేకాక, ఆసియా సమైక్యతకై ఆసియా సంఘ సమాఖ్యద్వారా కృషిచేయుటను కళ్ళారా గాంచుతూనే యున్నాము. సరోజినీదేవి కన్న బంగారుకల లన్నీ కార్య రూపేణా వచ్చేరోజులు, సమీపించుచున్నవి.

సరోజినీ గాంధీజీ, అరవిందయోగులు ప్రకటించినట్లు మళ్ళా విశ్వసందేశాన్ని భారతభూమియే యివ్వవలసి వున్న ట్లున్నది.*

"దారుణద్వేషాగ్ని నిండే దానవత్వం నశిస్తుందా!
బానిసల సంకెళ్ళు బిగిసే పాడుకాలం లయిస్తుందా!
సాధుసత్యపు సోదరత్వపు స్వానుసత్యం జయిస్తుందా
నిజంగానే" — శ్రీ శ్రీ

---

* ఆసియాసభ సమాప్తి చెందినంతనే కొరియా ప్రతినిధివర్గానికి చెందిన ఒక మహిళ వేదికపైకి వెళ్లి సరోజినీదేవి వనితాలోకమునకు చేసిన సేవకు ప్రశంసాసూచకంగా ఆమెకు కొరియా బొమ్మను కానుకగా యిచ్చింది. ఆసియాఖండానికి చేసిన సేవకు పండితనెహ్రూకు మరియొక బొమ్మ యిచ్చింది.

అఖిల ఆసియా మహాసభను ఏర్పాటుచేసి దానిని నిర్వహించుటలో వారి సేవను ప్రస్తుతిస్తూ, ఆసియాసభకు వచ్చిన ప్రతినిధులందరితరఫున సరోజినీదేవికి, పండితనెహ్రూకు, చెరియొక వెండిపళ్లెమును, చైనాప్రతినిధి వర్గనాయకుడు బహూకరించాడు.

# గవర్నర్

"పరిపాలనలో పాల్గొనడానికి బుద్ధిమంతులు నిరాకరించి దూరంగావుంటే దుష్పరిపాలన క్రింద జీవితంగడిపేశిక్ష వారు అనుభవించవలసివుంటుంది."

— ప్లేటో

1947 ఆగస్టు 15 తారీఖున భారతదేశం స్వాతంత్ర్యం పొందినది. స్వాతంత్ర్యభారతములో కాంగ్రెసుప్రభుత్వం అనేక గవర్నర్లను నియమించింది. వారిలో రాజాజీ, సరోజినీదేవి కాంగ్రెసు అగ్రనాయక శ్రేణిలోనివారు. డాక్టర్ బి. సి. రాయ్ విదేశాల్లో వుండగా ఆయనస్థానే తాత్కాలికంగా సరోజినీ దేవిని సంయుక్తరాష్ట్రాలకు గవర్నరుగా నెహ్రూప్రభుత్వం నియమించింది. డాక్టర్ రాయ్ స్వదేశమువచ్చినతర్వాత తాను వంగదేశసేవ చేయ సంకల్పించితినని ఆ పదవి అంగీకరించ లేదు. *

ఆమెకు అధికారమంటే అయిష్టం. అందువల్ల తన గవర్నరుపదవిసంగతి వినగానే 'వన్యవిహంగానికి పంజర వాసమా' అన్నది. అనేక కారణాలవల్ల దానిని ఆమె అంగీక రించక తప్పిందికాదు. బహుశా అందులో ఒక కారణం, స్త్రీలు పురుషులకు ఎందులో తీసిపోరని చూపించడానికి అయి యుండవచ్చు. పదవీనిర్వహణలో ఆమెకుగల కౌశలం అనన్యమని ఋజువుచేసింది.

---

* ఆయన నేడు పశ్చిమ బెంగాలు ప్రధాని.

పదవీస్వీకరణానంతరం ఆమె యెన్నోమార్పులు చేసింది. 'హర్ యక్సలెన్సీ' అని నన్ను మీరు పిలవటము ఏమిటి అసహ్యంగా? నేను మీకు తల్లిని, సోదరిని కూడను మీరు నన్ను అట్లా సంబోధించండి. నేనుకూడా మిమ్ముల అట్లాగే పిలుస్తా. మనం అంతా ఏకకుటుంబీకులం. మనలో మనకు మర్యాదలు, ఆడంబరాలు ఎందుకు?" అని ఆ పద్ధతి మాన్పించింది.

గవర్నరుకుండే బిరుదులతో పిలువకపోయినప్పటికి ఆమె గౌరవానికి భంగం కలుగలేదు. ఆమె వ్యక్తి ప్రతిభకు, గుణసంపదకు యిట్టి ఆడంబరాలు అతకవు. మెరుగుపెట్ట నేరవు.

గవర్నరుపదవిలో ఎక్కడికయి నా సంచారం వెళ్ళవలసి వస్తే, పెద్ద హడావుడిగా సపరివారసహితంగా బయలుదేరేది కాదు. తనకుమార్తె పద్మజను వెంటపెట్టుకొని పకపకలాడుతూ పేరంటానికి బయలుదేరినట్లు ఆ పెద్ద ముత్తయిదువ బయలు దేరేది. తాను పెద్ద హోదాగలవ్యక్తిననే భావము ఏ కోశాన వుండేదికాదు ఆమె దాన్ని సేవావ్రతంగా స్వీకరించిందిగాని, గౌరవభాజనమైన వుద్యోగంగా గ్రహించలేదు. అందుచేతనే ఆమె అతిచనువుగా అందరితోనూ, అరమరలేక ఆప్యాయంగా మాట్లాడేది. పైగా ఆమె యిట్లా అంటూవుండేది. "సింహాసనమెక్కి ప్రజలను పరిపాలించాలనే కోరిక నాకులేదు. పది మంది మనవాళ్లు ఎక్కడచేరితే అక్కడ వుండాలని అభిలాష తప్ప" ఆమె మాతృదేవత. కనుకనే అట్లా అనగలిగింది. అట్లా వ్యవహరించింది.

ఆమె అనేక కార్యకలాపాలలో పాల్గొన్నది. అనేక

వ్యక్తిత్వాలను తనలో విలీనమొనర్చుకొన్నది. అయినా ప్రతి దానిలోనూ విశిష్టతనే అలవర్చుకొన్నది. అట్లాగే లక్నో ప్రభుత్వభవనం ఆమెవ్యక్తిత్వాన్నే ప్రకటించింది. ఔను. గృహిణినిబట్టి గదా గృహము. ప్రభుత్వబాదరబందీలో యిరకాటంగా కళావిహీనంగావుండే ఆభవనం, ఆమె పాదంపెట్టుటతో అందాలు చిందేటి కళాకేంద్రమయింది. ఆభవనం ఆనందభవనమైనది. అతిథులకు ఆకర్షణీయమైనది.

ఆమెకు ఈపదవి చాలా సముచితమైనది. ఆచల్లనితల్లి పరిపాలనకాలములో ప్రజలు పరస్పర సౌహార్ద్రముతో శాంతి సౌఖ్యాలతో ఆనందం అనుభవించారు.

ఆమెను ఆరాష్ట్రప్రజలు ఆదరంతో 'అమ్మా' అని పిలుస్తూ, ఎంతో గౌరవభాజనంగా ప్రవర్తించేవారని ఆరాష్ట్రములోని ఒక ప్రముఖునిమాటవల్ల మనకు విదితంకాగలదు. ఆయన యిలాఅన్నాడు. "సరోజినీదేవి రెండువిధాలుగా మారాష్ట్రములో గౌరవాన్ని సంపాదించింది. తాను అనుసరిస్తూ, ఆదర్శాన్ని దర్శిస్తూ, రాష్ట్రములో శాంతిని, సుహృద్భావాన్ని మతసమైక్యతనూ, అభివృద్ధిపరచి – అహంకారాన్ని, వైషమ్యాన్ని అణచివేసింది. ఇది ఒక విజయం. లలితకళలపైన ఆమెకుగల అభిమానంవల్ల – అక్కడగలకవులకూ, రచయితలకూ, చిత్రకారులకూ, ఎంతో ఉత్సాహాన్ని కలిగించి వారిమన్ననలు పొందింది. ఇది రెండవవిజయం. గవర్నమెంటు భవనములోనికి ఈకళాకోవిదులు వెళుతూ విందునారగిస్తూ, కాలక్షేపాలు చేస్తూ వుండడం మామూలు దృశ్యమైపోయినది."

సరోజినీదేవిని దర్శించడానికి ఒకసారి వెళ్లినఅహమ్మద్ అబ్బాస్ ఇలావ్రాశాడా దివ్యదృశ్యాన్ని :—

"పూర్వం గవర్నర్లను కలుసుకోవడానికి ఏర్పాటు జరగాలంటే కనీసం పదిరోజులుపట్టేది. గవర్నరు సరోజినీదేవిని దర్శించడానికి అనుమతి సంపాదించడం పదినిముషాలు పట్టింది. ఫోనుచెయ్యగానే గవర్నరు కార్యదర్శి-మీరు ఇప్పుడేవచ్చినా రావచ్చు నని పలికాడు. నవభారతిలో ఆర్థికమైనమార్పు అగోచరమైనా, సాంఘికమైన గొప్పమార్పు కనిపించింది.

"గవర్న మెంటు భవనాలలో సామాన్యంగా మోటు అలంకారాలేగాని,కళాపూరితమైన శోభఅపురూపంగావుండేది. కాని మేము, యు. పి. గవర్న మెంటు భవనములో అతిథు లగదిలో అడుగుపెట్టగానే - విజ్ఞానంగల హైందవనారీ అభీష్టాన్ని వ్యక్తపరచే శోభకనిపించింది బల్లలమీద అరవిచ్చిన పుష్పాలు, గోడలమీద చక్కని ప్రాచీన ఆధునికచిత్రాలు కనిపించినాయి.

"సరోజినీదేవి వరండాలో దర్బారు తీర్చింది. ఒకవైపున కార్యదర్శికి తెలిగ్రాము చెబుతున్నది. ఒకప్రక్క ఎ.డి. సీ. తో తన కార్యక్రమాన్ని చర్చిస్తోంది. మధ్య మధ్య వేడికాఫీ కొంచెం చప్పరిస్తోంది. ఒకసారి అటుతిరిగిన పెంపుడుకుక్క లేడీ లింకాలూపిన్‌ను - దీనిపేరులోకూడా ఒకగమకంవుంది- దువ్వి నవ్వుతోంది. మధ్య మధ్య లోపలకు వచ్చిన అతిథులను ఆహ్వానిస్తూన్నది.ఒకసారి అటుతిరిగి వంటవానికి సలహాలిస్తోంది. ఆరోజువండబోయే కూరల్ని పరీక్షిస్తోంది.

"ఇవన్నీ ఏకకాలంలో అష్టావధానంగా జరిగిపోతు

న్నాయి. ప్రక్కనవున్న బల్లమీద చాలా పుస్తకాలున్నాయి. ఇంకో బల్లమీద వ్యాపారు లామెవద్దకు సెలెక్షనుకోసం తెచ్చిన రంగు రంగుల చీరలున్నాయి.

"ఇక చుట్టూ అర్ధచంద్రాకారంగా ఒక సైంటిస్టు, ఒక రచయిత, ఒక కవి జడ్జిగారి భార్యా ఒకామె, ఒక నర్తకి కొందరు గవర్నమెంటువుద్యోగులు, హైదరాబాదు నుంచి వచ్చిన కాంగ్రెసువాది ఒకాయన కూర్చొనివున్నారు.

"అవునుమరి — ఒక ప్రఖ్యాత కవయిత్రి, రచయిత్రి, ఒక గొప్ప దేశసేవిక, ఒక రాజకీయవేత్త, ఒక పరిపాలకు రాలు, ఒక గవర్నరు, ఒక సంపన్న గృహిణి, ఒక వీర భారత నారి — ఇన్నిటినీ, తనలో ఇముడ్చుకొన్న శ్రీమతి సరోజినీ దర్బారు ఇలా కాకపోతే ఎలా వుంటుంది మరి ?

"నేను వెళ్ళగానే ఆమె భవానీ భట్టాచార్యుల ఎడ్రసు అడిగింది. ఆయన గ్రంథం 'So Many Hungers' ఇప్పుడే చదివాను. చాలా బాగున్నది. ఆయనకు వుత్తరం వ్రాయా లన్నదామె ఏ గవర్నరు ఆధునిక నవలలు చదవడానికి కొంత కాలాన్ని వినియోగించగలడు ? వెనుక కేంద్రప్రభుత్వ మంత్రి ఒకాయన — 'ముల్కరాజ్ ఆనంద్' అంటే ఎవరు అని అడిగాడు. మరొక కేంద్రమంత్రి — ఉరుదు ఆయన మాతృ భాష — ఉరుదు కవి కృష్ణచందర్ అంటే ఎవరని ప్రశ్నిం చాడు.

"మధ్యాహ్నం భోజనమైనతరువాత ఆమె ఒక యువ కవి పద్యాలు వింటూ కూర్చున్నది. ఆవిడ తానొక గొప్ప కవయిత్రిననే దృష్టితో కాదు, తోటిరచయితగామాత్రమే !

పంజాబు దురంతాలనుగూర్చి వ్రాసిన పద్యంఒకటి ఆమె మనస్సును కలచివేసింది. ఆపైన గాంధీజీ హత్యనుగూర్చి వ్రాసిన పద్యం విని ఆమె కన్నీరుకార్చి "ఆమహాత్ముడుపోగానే నేను మాట్లాడినప్పు డీభావాన్నే చెప్పానుకాదూ ?" అన్నది. ఆరచయిత "అవునమ్మా ఆఉపన్యాసంవినే, నే నీపద్యం వ్రాశాను" అన్నాడు.

గవర్నరుగా ఆమె మహోన్నతికి శరణార్థుల నివాస సౌకర్యాలు కల్పించడానికి పాటుపడింది.

ఆమె శక్తిసామర్థ్యాలనుగురించి గవర్నరుగా ఆమె చేసిన ఘనకార్యాలు కొంతవరకు తెలిపితిని. యింకా ఎన్నో గలవు. మన ప్రధాని జవహరులాల్ నెహ్రూ యిలా కీర్తించాడు.

"వివిధసమస్యల నెదుర్కొంటున్న ఒక పెద్దరాష్ట్రానికి — ఆమె గవర్నరు. విశేషమైన శక్తిసామర్థ్యాలతో ఆమె పనిచేసింది. విశేషంగా ఆమె విజయాలను చూరగొన్నదికూడ. మంత్రివర్గసభ్యులు మొదలు పంటపొలాల్లో, కర్మాగారాల్లో పని జేసే ప్రజాసామాన్యంవరకు వివిధమతవర్గాలందరికీ ప్రేమపాత్రురాలుకావడంలోనే ఆమె పొందిన విజయం వ్యక్తమవుతున్నది. గవర్నరుగా ఆమె తనకర్తవ్యాన్ని అత్యద్భుతముగా నిర్వర్తించింది."

సంయుక్తరాష్ట్రాల ప్రధాని పండిట్ గోవిందవల్లభ్ పంత్ "లక్నోలోనేమి, అలహాబాదులోనేమి, నైనిటాల్‌లోనేమి, శ్రీమతి సరోజినీనాయుడు బసచేసిన ప్రభుత్వభవనా

ంలో భారతమహిళకు సహజమైన మాతృప్రేమ, ఆదరాభి మానాలు, అతిథులకు లభించేవి

"శ్రీమతి సరోజినీనాయుడు పరిపాలనాదక్షతను గురించి నేను వేరే వర్ణించ నవసరములేదు. రాజ్యాంగవ్యవహార ములో, రాజకీయాలలో ఆమె, అప్రతిమానప్రతిభను ప్రదర్శించింది. ముఖ్యంగా ఆమె స్వార్థం యెరుగదు. దేశం కొరకు అనేక త్యాగాలను జేసింది. అన్నిటికంటె ఆమె సహన శక్తి కడు గొప్పది."

రాజ్యాంగపరిషదధ్యక్షుడు రాజేంద్రబాబు "ఆమెకు గవర్నరు పదవిని సమర్పించడములో ప్రభుత్వము ఆమె హోదాను హెచ్చించలేదు. గవర్నరు పదవిని స్వీకరించడానికి ఆమె ఆమోదించడముద్వారా ఆపదవి హోదాయే హెచ్చింది"

సి. పి. గవర్నరుగావున్న పక్వాసాగారు "రాజకీయా లలో పురుషులున్నంతవరకు శాంతి లేద"ని ఒక విశ్వాసం దేశం వినిపించారు. అన్ని పదవులు స్త్రీలకు వదలితేనేగాని శాంతి యేర్పడదని ప్రవచించాడు. శాంతికి, క్షమకు, త్యాగానికి స్త్రీ అటుపట్టనే ఆర్యోక్తి వున్నది. ఆదృష్ట్యా చూస్తే పక్వాసాగారి ప్రవచనం పసిడితునక అవుతుంది.

ఆదృష్ట్యానేగాక సరోజినీదేవి పరిపాలనాదృష్ట్యా చూచిన, పక్వాసాగారి ప్రవచనం పరమసత్యమని విదితమైనది. ముందుకాలం మహిళలదే.

# మహా ప్రస్థానము

"శక్తి నిలుచును, బల క్షీణించును; శరీరము నశిం చును, ఆత్మ నశించదు"

— బైరన్

1949 వ సం॥ జనవరి 22 న తేదీని ఇండియా ప్రధాని పండిట్ నెహ్రూకు లక్నో విశ్వవిద్యాలయంలో డాక్టరు బిరుదును సమర్పించిన సందర్భములో జరిగిన స్నాతకోత్సవానికి ఆమె అధ్యక్షత వహించింది. ఈసమయంలోనే డాక్టర్ ఆఫ్ లా బిరుదును స్వీకరిస్తున్న పశ్చిమ బెంగాలు గవర్నరు కైలాస్ నాథ్ కట్జూ నుద్దేశిస్తూ ఛలోక్తిగా "నేను ఇండియాలోని గవర్నర్లందరు జోకరులే" అని ఆమె అన్నది. ఈస్నాతకోత్స వం జరిగినపిమ్మట మరొకసభకు ఆమె హాజరుకానేలేదు.

ఫిబ్రవరి 15 తేదీనుండి సరోజినీదేవి సుస్తిగానే యుం టున్నది. భరించరానంతగా తలనొప్పివస్తున్నదని ఆమె అంటూ ఉండేది. ఫిబ్రవరి 20 తేదీన పశ్చిమ బెంగాల్ ప్రధాని (ఆమె డాక్టరు) డాక్టర్ బి. సి. రాయ్ లక్నోలోదిగి ఆమెను పరీక్ష చేసి పూర్తిగా విశ్రాంతి తీసికోవడము అవసరమని చెప్పి, సభా సమావేశాలలో పాల్గొనవద్దని సలహాయిచ్చాడు.

ఫిబ్రవరి 25 తేదీని కొంతమంది డాక్టర్లు ఆమెను పరీక్ష చేసి 28 వ తేదీన 'ఆక్సిజన్' యిచ్చారు. చికిత్స ప్రారంభం కావడంయిదే. మార్చి 1 రాత్రి 9½ గంటలకు రక్తం కొంత తీసివేశారు. అంతట ఆమెకు కొంచెము ఊపిరి సల్పడము

ప్రారంభించింది. తలనొప్పికూడా కొంత తగ్గింది. నిద్రపట్టేం దుకు యింజక్షను యిచ్చారు.

ఆమెవద్ద ఆమె బంధువులు ఎవరూ లేరు. సర్వదా ఆమె వెంటవుండే ఆమె కుమార్తె పద్మజానాయుడు అలహాబాదులో కమలానెహ్రూ ఆస్పత్రిలో బీగం ఆజాదు భవనానికి గవర్నరుజనరల్ రాజాజీ జరుపుతున్న ప్రారంభోత్సవానికి వెళ్ళింది. సరోజినీకూడా యీసభకు హాజరయి వుండవలసింది! డాక్టర్లు సలహాలివ్వడముచేత మానుకొంది. ఆమె భర్త మేజరు నాయుడు, ఆమె కుమారుడు డాక్టరు జైసూర్య, కుమార్తె లీలామణి హైదరాబాదులోనే వున్నారు. ఆమెకు సుస్తీగావున్నదని తెలిసి రెండురోజులనుండి కుమారుడు వెళ్ళాలనుకున్నాడేగాని వెళ్ళలేకపోయాడు.

అవసానకాలములో ఆమెవద్ద ఒక్క నర్సుమాత్రమే వున్నది. ఆత్మబంధువులు ఎవరులేరు. మార్చి 2 వ తారీఖు రాత్రి 10-45 గంటలకు యేదైన ♦ పాటలుపాడమని ఆనర్సును కోరుతూ "నిన్ను శ్రమపెట్టుతున్నందుకు విచారిస్తున్నాను; సరే మరినాతో మాట్లాడవద్దు నన్ను తాకవద్దు" అన్నది. నర్సు పాటలుపాడుతూవుండగానే ఆమెకు బాగానిద్ర పట్టింది. కాని తిరిగి రెండున్నరగంటలకే ఆమెకు మెళుకువ వచ్చింది. మెళుకువరాగానే దగ్గు ప్రారంభమైనది. అక్కడేవున్న వైద్యులు తిరిగి ఆమెను పరీక్షచేసి ఉపచారాలు చేస్తూనేయున్నారు.

---

♦ పాటతో ఆమెజీవితము ప్రారంభమైనది. పాటతోనే అంత్యమైనది. ఆమె జీవితమే ఒకపాట. లక్నోలోనే ఆమె రాజకీయజీవితం ఆరంభమై అక్కడనే అంత్యమైనది.

కాని 2 వ తేది తెల్లవారుఝామున మూడున్నరగంటలకు ఆమె అనాయసంగా యీలోకం వీడింది.

భారతాకాశపథమునుంచి ఒక మహోజ్జ్వలతార పతన మైనది. భారతస్వాతంత్ర్యసమరాంగణములో అగ్రశ్రేణిలో కాలూని పోరాడిన వీరాంగన, రాజకీయాలతో, సంస్కృతిని మేళవించి, తన నిరుపమాన విశాలదృక్పథముతో వాటికి విన్నాణముచేకూర్చిన జ్ఞాననిధి, మహాకవయిత్రి, మాతృస్వరూపిణి అస్తమించినది. ఈవార్త తెల్లవారుసరికి ప్రజాసమూహము లకు తెలిసి గవర్నమెంటుహౌసుకువచ్చి స్త్రీలు పిల్లలూ పురుషులు_ అనేవ్యత్యాసము లేకుండా, అందరూ కన్నీరుమున్నీరుగా విలపించినారు. హైకోర్టుజడ్జీలు, మంత్రులు, వున్నతోద్యోగులు సరోజినీదేవి భౌతికదేహంవున్న గదిలోకివెళ్లి తుదసారి ఆమె దర్శనముచేసుకుని వచ్చారు.

ఆమెమృతికి సంతాపసూచకంగా ప్రభుత్వకార్యాలయాలన్నిటిపైన సగంవరకు జాతీయపతాకములు దించివేయబడినవి. ప్రభుత్వకార్యాలయములు మూసివేయబడినవి. ఆమె మరణించినవార్తవినగానే పద్మజతోసహా,అలహాబాద్‌నుండి యు.పి. ప్రధాని పండిట్ గోవిందవల్లభ్‌పంత్, డాక్టరు జీవరాజమెహతా, కమలాదేవి చటోపాధ్యాయకూడా అక్కడికి వచ్చారు.

ఇండియాప్రధాని జవహర్లాల్ నెహరూ, రాజగోపాలాచారి మొదలగు ప్రముఖులు ఆమధ్యాహ్నమునకే లక్నో చేరారు.

ఆమె భౌతికదేహాన్ని సాయంత్రం 4_4_10 నిము

షములకు – గవర్నమెంటుహౌసునుంచి, గోమతీనదీతీరమున వున్న శ్మశానవాటికకు, రాజోచితమర్యాదలతో ఊరే గిస్తూ తీసుకువెళ్లారు.

ఒకవైపుపాడుగునా ఎటుచూచినా జనమే ! సుమారు డెబ్భైవేలమంది ప్రజ ఆమె అంత్యక్రియలకు హాజరయినారు.

తండోపతండములుగావచ్చి రోడ్డుకు యిరువైపులనిల్చి కన్నీటితో ఆమెకు తర్పణ యిచ్చారు. రాజగోపాలాచారి దుఃఖావేశములో ప్రసంగిస్తూ, "సరోజినీ ఆత్మ భౌతికబంధ విముక్తమై శాశ్వతశాంతిని పొందిన"దని వాకొన్నారు. ఊరే గింపు బయలుదేరడానికిపూర్వం సుచేతా కృపలానీ భక్తి గీతాలను పాడి రామనామసంకీర్తనం చేసింది. సాయంకాలం గం 3-5 నిముషములకు – పుష్పమాల్యాదులతో అలంకరించిన ఆమె భౌతికదేహం, జాతీయ త్రివర్ణ పతాకశోభితమైన సైనిక శకటముపై వుంచినప్పుడు ప్రత్యేకప్రార్థనలు జరిపారు. సైనిక శకటంవెంట ఏరియా కమేండింగుసేనాని 'మేజర్ జనరల్ ఢిల్లాన్' ఆశ్విక పోలీసుదళాలతో ఊరేగింపుకు అగ్రగామిగా నడచినాడు.

వారివెనుక పాదచారులై అంగరక్షకులు, సైనికులు, సైనికాధికారులు వెంటరాగా పొడుగున ఊరేగింపు సాగింది – వెనువెంటనే ఆమె బంధువర్గము, లేడీ మౌంట్ బాటన్, పామెలామౌంట్‌బాటన్, రాజగోపాలాచారి, ఛీఫ్ జస్టిస్, ఇండియామంత్రులు, యు. పి. రాష్ట్ర మంత్రులు, యు. పి. అస్సెంబ్లీస్పీకరు, లెజిస్లేటివ్ కౌన్సిలు ప్రెసిడెంటు, లక్నో విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు, హైకోర్టుజడ్జీలు,

ప్రభుత్వ ఛీఫ్ శెక్రెటరీ ప్రభృతులు వున్నారు. వీరిలో అనేకులు పాదచారులుగనే వెళ్ళారు.

సాయంకాలము 6-15 గంటలకు డాక్టరు జై సూర్య చితికి మూడుసారులు ప్రదక్షిణముకావించి, తల్లి భౌతిక దేహానికి అగ్నిసంస్కారము చేశాడు.

అగ్నిసంస్కారానికిపూర్వం భౌతిక దేహానికి కప్పిన మంచిగంధపుచెక్కలు, ఘృతము, కుంకుమపువ్వు మొదలగు సుగంధద్రవ్యాలు వుంచారు. కొద్దినిముషాలలో సరోజినీ భౌతిక దేహం అగ్నిజ్వాలలకు ఆహుతియైపోయింది.

* "ఆగు మృత్యుదేవతా, కాస్త ఆగు, నా మధుర జీవితో వసంత మిపుడే ప్రవేశించింది; సుందరమైనది నాయువ్వనం, దానితరుణ శాఖలపై గండుకోయిల లిపుడే గొంతు విప్పు తున్నాయి. నేనప్పుడే మరణించలేను.

"ఆగు మృత్యుదేవతా! కాస్త ఆగు. నాఆశాసుమాలింకను వికసించనేలేదు. నా ఆనందమింకా పంటకు రానే రాలేదు. నాపాటలింకా నేను పాడుకోనేలేను. కురియించగల కన్నీటను అంతను నేను కురియించనేలేను. నేనప్పుడే మరణించలేను.

"ఆగు కాస్త ఆగు. ప్రేమవిషాదాల పాత్రికను అడుగంటు గ్రోలనీ- భూమ్యాకాశాల సౌందర్యాల్ని తుదముట్టజూడనీ-కోర్కెలన్నిటినీ కొసలు తేలనీ. ఓ మృత్యుదేవతా నేనప్పుడే మరణించలేను.*

---

* ఆమె గీతము.

* "తరుణకంఠాన్ని విచ్చుక వెలువడ్డ ఈ తీయని పాట మృత్యుదేవత కటికగుండెనయినా కరిగించకలిగేది; కాదా? అయినప్పుడు అది ఆగ కేమిచేస్తుంది ?

"మృత్యుదేవత ఆగింది; కాస్త ఆగడమైనా కాదు. చాలాకాలమాగింది. సరోజినీ దేవి ఆశాసుమాలన్నీ వికసించనే లేదు. ఆమె ఆనందమంతా పంటకు రానే లేదు. మరియు కురియించగల కన్నీటిని అంతటిని ఆమె కురియించనే లేదు.

"ఇంతేగాదు. ఆమె ప్రేమ విషాదాలపాత్రికను అడుగంట గ్రోలనే లేదు. భూమ్యాకాశాల సౌందర్యాల్ని తుద ముట్ట చూడనే లేదు. ఆమె కోర్కెలన్నీ కొసలు తేలడమైనా జరుగ లేదు.

"శిథిలశిశిరశీత వాయువుల స్పర్శ, అప్పుడప్పుడు సోకినా, ఏదో ఒక ఘట్టం కాక ఆమె యావజ్జీవితం నవవసంతమే! ఈమధ్యనే ఆమె సప్తతిజన్మదినోత్సవాన్ని జరుపుకుని వుండవచ్చు. అయినా ఆమె జీవితవనం నవకోమల కుసుమ భరితమే. ఆవనములో గండుకోయిలింకను పాడుతూనే వున్నాయి.

"మరి ఆగ లేక మృత్యుదేవత నిన్నరాత్రి ఆమెను తన ఒడిలో చేర్చుకునే వుండవచ్చు"

♦ "ఆమె వెళ్ళిపోయింది ? ఎక్కడికి వెళ్ళింది?

ఆమె వెళ్ళిపోయింది ? ఎవరా వెళ్ళింది? ఈ ప్రశ్నకు వందజవాబు లున్నాయి.

---

* ఆంధ్రప్రభ, సంపాదకీయము, 3-3-39

♦ ఆమె మరణించిననాడు రేడియోలో ఆమె సోదరుడు హరీంద్రనాధుడు చేసిన ప్రసంగం.

"ఈ దేశ జీవితంలో ప్రియమైనవస్తువు వెళ్ళిపోయింది. నలభై కోట్లమంది భారతీయుల ప్రియసోదరి వెళ్ళిపోయింది. కష్టాలలోవున్న ప్రజల కన్నతల్లి వెళ్ళిపోయింది. మహిళలలో రాణి వెళ్ళిపోయింది. శక్తికి చిహ్నం వెళ్ళిపోయింది. మాతృభూమిలో అమూల్యమైన చైతన్యం వెళ్ళిపోయింది. రంగు వెళ్ళిపోయింది. పాట వెళ్ళిపోయింది. నవ్వు వెళ్ళిపోయింది. సాంఘికజీవితంలోని పూలబరువు వెళ్ళిపోయింది. కాని, ఈ జవాబు లన్నిటిచివరా – ఆమె ఎక్కడికీ వెళ్ళిపోలేదనే సత్యం వుంది.

"సంధ్యాసమయాన్ని, కుసుమసంతతిని ఆరాధించిన ఆ నేత్రాలు మృత్యువువల్ల మూసుకొన్నాయి. అందం, న్యాయం, సత్యం, స్వాతంత్ర్యం, సమరం, బంధవిముక్తి, మానవజాతిహక్కు — వీటినిగూర్చి ప్రసంగించిన ఆవక్త్రం మృత్యువువల్ల మూతపడింది. ఒక్క మహాత్ముని యెదుట – ఆయన ఒక్కని యెదుటనే – ముడుచుకొని లోలోపల వణికిన ఆ హస్తాలు, భస్మంగా మారిపోతున్నాయి. ఆమె శరీరం మంచిగంధపుచెక్కలచితిపైన రాజకీవితో రగుల్కొల్పబడుతోంది.

"ఆ దృశ్యాన్ని చూచినవారంతా–ఆమె వెళ్ళిపోయిందనుకొంటారు. కాని మనం తెలివితక్కువవాళ్ళం – మనం అంధులం – మనం సరిగా గ్రహించుకోలేం – ఆమె ఎక్కడికి వెళ్ళింది ? ఇదివరకే తనకు నివాసంగా ఏర్పరచుకొన్న ప్రజాహృదయములోనికి వెళ్ళిందామె. మృత్యువు కల్పించిన మౌనంతో, ఝాపంలేని స్తిమితంతో ఆమె ఇలా చెబుతోంది.

"యువతీయువకులారా! మేము మీమీద గొప్ప భారం వుంచి పోతున్నాం. మీరు ఈ బాధ్యతను స్వీకరించడానికి, దాన్ని ధైర్యంతో, విజ్ఞానంతో నిర్వహించడానికి, సంసిద్ధంగా వుండండి. మేము మీ వెనుకటితరంవాళ్ళం. మేము చేయగల దంతా చేశాం – ఈ వెళ్ళిపోయేవాళ్ళమంతా స్వాతంత్ర్య సముపార్జనకు శక్తివంచన లేకుండా పాటుపడ్డాం. ఈ స్వాతంత్ర్యాన్ని కాపాడేబాధ్యత మీది. దాన్ని శాంతిసీమలకుచేర్చే బాధ్యత మీది. ప్రజలందరూ దాన్ని అనుభవించేలాగ చేసే బాధ్యత మీది.

"అవును. ఆ పెదవులు మాట్లాడకలిగియున్నప్పుడు, ఆ నేత్రాలు చూడగలిగినప్పుడు, ఆ హృదయం స్పందించగలిగినప్పుడు ఈ వాక్యాలే ఆమె వినిపిస్తూవుండేది."

## శ్రద్ధాంజలి

సరోజినీదేవి యిహలోకయాత్ర చాలించిందని వినగానే ఆ సర్వప్రియకు సమస్తలోకము బాష్పాంజలి సమర్పించినది. భారతదేశీయులే కాదు. సర్వప్రపంచము సంతాపము చెందింది. ఆకాశవాణి విలపించింది. పత్రికా ప్రపంచము పరితపించింది.

మన గవర్నర్ జనరల్ రాజాజీ యిట్లా తన సానుతాపం వెల్లడించాడు. "ఆమె మృతులైన మహానుభావులను చేరసేగింది. మనం ఆమె అడుగుజాడల్లోనే నడుస్తూ, ఆమె అనుయాయులమని అనిపించుకొనుటకు తగు అర్హతను సంపా

దించుకోవాలి. మనమెన్నడును సంకుచిత తత్వమునకు తావీయక విశాలహృదయాలతో కృషి సాగించవలసియున్నది. సరోజినీదేవి తన దేశప్రజలకు నేర్పిన దిదే! ఆమె ఆశయం నెరవేరుగాక! ఆమె ఆత్మ సర్వదా మనల నాశీర్వదిస్తూ, మనలను వీడకుండా సంచరించుగాక!"

మన ప్రధాని నెహ్రూ యిలా జోహారు లర్పించాడు. "శ్రీమతి సరోజినీదేవి భౌతికరూపం అంతరించిపోయినా, ఆమె అందజేసిన సందేశము మాత్రం అమరమై నిలుస్తుంది. ఆదివ్య జ్యోతిని ఉన్నతపథాల ముందుకు కొనిపోయే సంస్కార బలిమి ఈదేశంలోని స్త్రీ పురుషులకు వున్నదా? ఆమె మాకు అందజేసిన సందేశసారాంశాన్ని తిరిగి భారతప్రజకు అందజెయ్యడములో మేము కృతకృత్యులౌదుముగాక!

"మనం నేడు విలపిస్తున్నది ఎవరినిమిత్తం? ఆమె దేశోద్ధారకురాలు. అంతర్జాతీయరంగములో ఖ్యాతి వహించింది. భారతచరిత్రమాత్రమేగాక ప్రపంచచరిత్రకూడా ఆమెను ప్రశంసిస్తుంది. ఆమె స్వప్నసీమలో విహరించింది. ఎన్నో పాటలుపాడిన గాయకురాలు. ఆమె ఒక మహాదర్శం కొరకు పోరుసల్పింది కూడా. సతతం ఆమెలో చైతన్యం తొణికిసలాడుతూ వుండేది. 50 సంవత్సరాలపాటు ఆమె గడిపిన జీవితము సర్వలక్షణసమన్వితమై ముందుకు చొచ్చుకునిపోయింది. ఆమె స్పర్శ పరుసవేదివంటిది. పట్టిందల్లా బంగారమయింది. అందరికీ మోదం కూర్చేది. ఆమె సర్వప్రియ. క్షణికోద్రేకాలకూ, దురభిప్రాయాలకు లొంగిపోయి ఆమె సహనాన్ని కోల్పోయేదికాదు. బహుముఖమైన సంస్కృతి ఆమెలో

మూర్తీభవించింది. మనతో సాహచర్యం నెరపిన ఆ ఆనంద మయమూర్తి ఎల్లప్పుడు సుఖహాసంతో తుళ్ళింతలాడుతూ న్నట్లు మనకు కళ్ళకు కట్టినట్టు కనపడుతూవుంటుంది. అందు వల్లనే ఆమెకు మరణమే లేదు. భారతమాత కడుపునపుట్టిన ఈఉత్తమ పుత్రికకు ఆమెద్వారా భారతమహిళలకునాజోహార్లు. మనం ఏది సాధించినా, అదిసరోజినీదేవి చలవే. నే నీనాడు ఇలాఉన్నా నంటే అందుకు కొంతవరకు సరోజినీదేవి ప్రభావమే కారణం. 33 సంవత్సరాలక్రిందట జాతీయకాంగ్రెసు సభావే దికపైనుంచి ఆమె చేసిన ప్రసంగం నన్ను చకితుణ్ణి చేసింది. అనంతరం ఆమె ప్రసంగాలు ఎప్పుడువిన్నా అలాగే దిగ్భ్రమ చెందే వాణ్ణి.

మన ఉపప్రధాని పటేల్ జోహార్లు. "ఆమె ఏసభకువచ్చినా, ఏసమా వేశంలోపాల్గొన్నా, ఆకస్మికంగా కొన్నివందల జ్యోతులు వెలిగినట్లు ఆప్రదేశమంతా శోభాయ మానమయేది. ఆమె వ్యక్తిత్వంలోని నిరుపమానవిశిష్టత ఆమె పలుకులోని మాధుర్యం భారతప్రజలకు ఆమెను సన్ని హితురాలుగా జేసినవి.కనక నే వారు ఆమెను 'భారతకోకిల' అని ప్రేమాదరములతో పిలుచుకొన్నారు.

"ఆమె మనస్సులో జనించే ప్రతిభావం ఒకమధురగీతంగా వెలువడేది. ఆగీతాలలో అనిర్వచనీయ కవితాధోరణి స్ఫురించేది.

"ఆమె ప్రసంగాలు, నిత్యానందసంధాయకాలు. ఎంత దురదృష్టమో, మహోజ్వలభావాలను ప్రతిఫలించే ఆనేత్రా

లను సాగరగంభీరమైన ఆకంఠనాదాన్ని ఉత్తేజకరమైన ఆమె ఉపన్యాసాలను ఇకమనం కనబోము, వినబోము.

"సుదీర్ఘ భారతస్వాతంత్ర్య సమరకాలాన ఆమెలో భారతమహిళల అపూర్వత్యాగసహిష్ణుతలు, కార్యదీక్ష మూర్తీభవించినవి. భారతస్వాతంత్ర్య లక్ష్యసాధనకై సాగించిన కృషిలో ఆమె తనవిశ్వాసాన్ని ఎన్నడూ కోల్పోలేదు. స్వాతంత్ర్యసాధనకై బాపూజీ జాతికి సమర్పించిన అహింసాస్త్ర విజయంపట్ల ఆమె విశ్వాసం ఎన్నడూ చలించలేదు. కాంగ్రెసువర్కింగ్ కమిటీలో ఆమె సభ్యత్వం యితరులకు ఎంతో ప్రోత్సాహం కల్గించేది."

మన రాష్ట్రపతి డాక్టర్ పట్టాభి :— "శ్రీమతి సరోజినీదేవి అతిలోక ప్రతిభాశాలిని. ఆమెకు మనోవికాసం, ఆత్మవికాసం ఎప్పుడుకలిగినవో చెప్పడం కష్టం. ఆమె దేశభక్తురాలనిమాత్రం చెబితే చప్పగా వుంటుంది. కవయిత్రి అని చెప్పి వూరుకున్నా సామాన్యంగానే వుంటుంది. ఈపుడమిపై అవతరించిన శక్తిస్వరూపిణి ఆమె. రుద్రకాళి భద్రకాళి కూడా.

"ఆమె గొప్పింటిబిడ్డ. ఆమె ప్రజ్ఞకూడా అట్టిదే. ఆమె విశాలదృష్టి, విశాలహృదయం, ఆమె ప్రదర్శించే సానుభూతి హృదయపూర్వకమైనది. ప్రాక్ప్రతీచీసంస్కృతుల సమ్మేళనం ఆమెలో మూర్తీభవించింది.

"భారతమహిళలకు విముక్తికలిగించడానికి భారతీయులలో జాతీయతను పునరుద్ధరించడానికి ఆమె అర్ధశతాబ్దం కృషిచేసింది. ప్రాచ్యఖండ స్వాతంత్ర్యానికి, సమైక్యానికి ఆమె పునాదివేసింది. బ్రిటీషు ఆస్థానకవివలెనే ఆమెకూడా

ప్రపంచశాసనసభ ప్రపంచసమాఖ్య యేర్పడాలని కలలు గన్నది.

"ఆ దివ్యఘటన జరిగేవరకూ ఆమె జీవించలేదు. కాని ఆలక్ష్యసిద్ధి త్వరితంగా జరిగేటట్టు ప్రాక్పశ్చిమ సమ్మేళనానికి ఆమె కృషిచేసింది."

రాజ్యాంగపరిషత్తు అధ్యక్షుడు రాజేంద్రబాబు:— 'శ్రీమతి సరోజినీనాయుడు నిర్యాణంతో ప్రపంచం మొత్తముపై తన యశశ్చంద్రికలను ప్రసరింపజేసిన ఒక ఉత్తమ నారీమణిని యిండియా కోల్పోయింది. వక్తృత్వములో కవితా ప్రపంచములో, రాజకీయరంగములో, ఆమె ప్రదర్శించిన ప్రతిభావిశేషాలు అనన్యసామాన్యములు. ఆమె నిర్యాణము వల్ల ఏర్పడిన లోటును యిండియాలో మరెవ్వరును పూరింపజాలరు.

"నేను విద్యార్థిగా నున్నరోజుల్లో (40 సంవత్సరాల క్రిందట) దాదాభాయి నౌరోజి అధ్యక్షత వహించిన కాంగ్రెసుసభలో ఆమె చేసిన గంభీరోపన్యాసం నే నెన్నటికినీ మరువజాలను. ప్రజల్లో ఉత్తేజోత్సాహాలను రేకెత్తించుటలో ఆమెకుసాటి ఎవ్వరులేరు.

"గాంధిమహాత్ముని సన్నిహిత అనుయాయులలో శ్రీమతి సరోజినినాయుడు ముఖ్యురాలు. ఆమెకు "ఇండియాకోకిల" (నైటింగేల్ ఆఫ్ యిండియా) అనే బిరుదు గాంధిమహాత్ము డిచ్చినదే."

డాక్టర్ రాధాకృష్ణ:— "ఇండియా తన గౌరవ ప్రతి

ష్ఠలను దేశములోను, విదేశాలలోనుకూడ యినుమడింపజేసిన ఒక ఉత్తమ తనయను కోల్పోయింది.”

జమాలుద్దీన్ అబ్దుల్ వాహెబ్ - (పీపుల్సుపార్టీ మాజీ ముస్లింలీగు సభ్యుడు)—“ముస్లిం ప్రజాసామాన్యానికి ద్రోహం జేసి ముస్లింనాయకులందరు యిండియానుంచి వెళ్ళిపోయిన ప్పుడు శ్రీమతి సరోజినీనాయుడువచ్చి భయభ్రాంతులైన ఆ ముస్లింప్రజానీకానికి ఆశాసందేశాన్ని అందజేసింది. మిష్టర్ జిన్నా పేరును ఉచ్చరించడానికికూడా వారు భయపడుతున్న సమయములో ఆమె ఆయన మరణంపట్ల సానుభూతి సందేశాన్ని పంపించింది.”

అవిభక్తబెంగాల్ మాజీప్రధాని సుహ్రావర్ది:—“మన అక్క, మహాశక్తి, ఉత్తమకవయిత్రి ఉద్బోధకురాలైన శ్రీమతి సరోజినీనాయుడు నేడు మనలను వీడిపోయింది. యావద్భారత దేశానికి యిదితీరనినష్టం.”

పాకిస్థాన్ గవర్నరు జనరలు నజీముద్దీన్:— శ్రీమతి సరోజినీదేవి నిర్యాణము ప్రపంచవిజ్ఞాన సంస్కృతులకు పెద్దదెబ్బ.

జార్జిరాజు:— సరోజినీదేవి నిర్యాణవార్తవిని ఎంతో విచారించాము.

లార్డువేవెలు:— దేశభక్తురాలుగా, కవయిత్రిగా, ఆమె చేసినకృషి అనన్యసామాన్యమైనది. ఆమె నిర్యాణం ప్రపంచానికే తీరని నష్టం.

ఆస్ట్రేలియా ప్రధాని:— శ్రీమతి సరోజినీదేవి బహుముఖప్రజ్ఞావిశేషాలు ఆమెకు అంతర్జాతీయఖ్యాతిని చేకూర్చి

నవి. అట్టి విదుషీమణి నిర్యాణానికి ఆస్ట్రేలియా ప్రభుత్వం తర ఫునా, ప్రజల తరఫున సానుభూతిని తెలుపుతున్నాను.

మద్రాసు ఆర్థిక శాఖామంత్రి గోపాలరెడ్డి:— శ్రీమతి సరోజినీదేవి భారత స్వాతంత్ర్య సమరాంగణములో అగ్రశ్రే ణిలో కాలూని పోరాడిన వీరవనిత. రాజకీయాలతో సంస్కృ తిని మేళవించి, తన నిరుపమాన విశాల దృక్పథముతో వాటికి విన్నాణము చేకూర్చిన విజ్ఞాననిధి. ఇదే ఆమె సేవలోని విశి ష్టత. ఆమె మహా కవయిత్రి.

రామస్వామిరెడ్డియార్:— మహిళాలోకం ఎంతటి ఘనకార్యాలు సాధించగలదో శ్రీమతి సరోజినీదేవి చరిత్ర ధృవతార కాగలదు. ఆమె అధునాతనమైత్రేయి.

కమలాదేవి చటోపాధ్యాయ:— ప్రపంచములో ఆద ర్శాలు కరువు లేదనటానికి శ్రీమతి సరోజినీదేవి తార్కాణం - ఇంతటి ఖ్యాతితో ఆమె నడచినబాట మనకు అనుసరణీయం.

చైనా రాయబారి:— మహాకవయిత్రి రాజనీతిజ్ఞ అయిన శ్రీమతి సరోజినీదేవి మరణంతో నేను శోకపూరితు ణ్ణయినాను. భారత స్వాతంత్ర్యానికి ఆమె పితామహిఅయితే, ఆమె మరణం ఒక్క భారతదేశానికిమాత్రమే తీరనిలోటు కాదు. మానవచరిత్రలో నాయకత్వం వహించిన ఒక మహి ళామణి కావడంవల్ల ఆమె మృతి ప్రపంచానికికూడా వెలితే. దయార్ద్రహృదయము వశీకరణశక్తిగల ఆమె అద్భుత వ్యక్తిత్వం, ఆమె వెదజల్లే హాస్యపుజల్లులు, రాజకీయాలలో కవనంలో, ఇతరరంగాలలో, ఆమె కల్పించే వుత్సాహోత్తే జాలు మానవకోటికి వెలుగుబాటలు కాగలవు.

అమెరికా రాయబారి:— 'సరోజినీదేవి మరణవార్త భారతీయులందరికీవలెనే నాకుకూడా హృదయవిదారక మయింది. ఆమెనుగురించి విశేషంగా తెలిసికొనేటట్లుగా నేను భారతదేశానికి శీఘ్రంగా రాకపోయినందుకు చాలా విచారిస్తున్నాను. అయితే ఆమెను నేను చూచిన కొద్దిసమయాల లోనే ఆమె చాలా ప్రముఖమహిళ యనీ, నాయకురాలిలక్షణాలన్నీ ఆమెలో కలవనీ నేను గ్రహించాను. ఈ దేశప్రజలకేకాక, పెక్కుమంది అమెరికన్లకుకూడా ఆమె వుత్తేజం కలిగించింది.

అమెరికన్ ప్రభుత్వం అమెరికన్ ప్రజలుకూడా సరోజినీదేవి మృతికి తమ సానుభూతిని తెలుపగలరనే నావిశ్వాసం."

శ్రీమతి సరోజినీనాయుడు సోదరుడు హరీంద్రనాథ్:— 'మృతులైన మహాపురుషులు తారాపథానికివెళ్ళి నక్షత్రాలై ప్రకాశిస్తున్నారని ప్రతీతి. అలాగే నేడు సరోజినీదేవికూడా వెళ్ళింది. ఆమెకూడా గగనతలంలో మహోజ్వల తారయై శాశ్వతత్వం పొందగలదు. ఆమె ఒక రాష్ట్రానికి గవర్నర్‌మాత్రమేకాదు. కోట్లకొలది ప్రజాహృదయాలపై 50 సంవత్సరాలపాటు ఏలుబడి సాగించిన సామ్రాజ్ఞి ఆమె."

''నిత్యస్వచ్ఛశ్వేత జీవనాళాలలో
అరుణారుణరక్త కణాలలో
నవనవరణదృజిత కేశాగ్రములలో
సుధామధురధారలు చిందుహాస్తగంటములో
శీతావాతాతపపీడితతాడితప్రజలకు
ప్రసాదించు సానుభూతికరానునయవాక్యాలలో

ప్రేమమయ భావాలలో
ప్రియతమసౌహార్దమిళిత సందేశాలలో
అమృతమయ సూత్రాలలో
అడుగడుగులో క్షణక్షణమూ అహరహాలు
ప్రజ్వలత్ ప్రగతిప్రాచ్యస్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ప్రతిధ్వ
నించే ప్రతిఫలించే ఒక్క ఉత్తమాదర్శమహిళ
ఉన్నతాశయనారి ఉదారస్వభావవనిత
ఉత్తుంగహిమాచల భావావేశ అనుసృతఔచిత్యవిచక్షణపరి
జ్ఞానవిదుషి
హృదయాంతర్గత వేదనామానవానీక నిరతసేవాభిలాషా
నాయకి
విశ్వశాంత్యాదర్శ విశ్వభారతీ అధ్యక్షురాలు
సంయుక్తరాష్ట్ర పరిపాలనా నిర్వాహక స్థితప్రజ్ఞురాలు
విశాలవిశ్వ ప్రపంచమహిళాశిరోభూషణ
మకుటాగ్రభాస్వత్ విద్యుదుజ్జ్వలమణి
విశ్వకవయిత్రి విశ్వనాయకి విశ్వగాయకి
సప్తదశవర్ష ప్రౌఢ శ్రీమతి సరోజనీదేవి
పవిత్రాత్మ శాంతియాత్రలో మాగద్గదగళ 'జై జై'నినా
దాలు ఆమె అస్తంగతాత్మకు మాజోహార్లు''

దీక్షితులు, ఉషాదేవి
(తరుణసాహితీసమితి)

# జీవితతత్త్వము

" Kind hearts are more than coronets "—Tennyson.

" I find that there is something that is final for men and women other than mere intellectual eminence which they should aspire for — and that is greatness of heart "

—Sarojini Devi.

సరోజినీదేవినిగురించి యింతవరకు స్థూలంగా చెప్పబడినది. ఇక ఆమెనుగురించి పరిశీలనాదృష్టితో పరికించి, జీవితతత్త్వము నారయవలసియున్నది. ఆమె జీవితము ఆటపాటలతో, క్రీడావిలాసాలతో ఆరంభమైనది. మధ్యకాలము, కవిత్వము యింకా అనేక జీవితప్రవృత్తులద్వారా ప్రపంచానికి ప్రేమసందేశ మిచ్చుటద్వారా గడచింది. ఉత్తరభాగము మాతృత్వముయొక్క హృదయవైశాల్యముతో విరాజిల్లినది. ఆమెతన జీవితాన్ని అత్యధికస్వాభావికంగా గ్రహించి వికసింపజేసింది. సరోజినీదేవి జీవితము సింహావలోకనచేసే పాఠకులకు, ఈ కవికోకిల కంటకమైన రాజకీయరంగములో యేల ప్రవేశించిందనే ప్రశ్న పొడమకమానదు. సాహిత్యము జీవితమునుండి భిన్నమని తలచేవారు ఆమె కవితాక్షేత్రము వీడి, తనకుతానుగా నష్టపడినదని భావింతురు. సరోజిని సాహిత్యరంగములో వున్నట్లయితే ప్రపంచప్రఖ్యాత కవులలో పరిగణింపబడెడిదనికూడా భావింతురు విమర్శకు లిదివరకే ఆమెను మహాకవయిత్రియని ప్రశంసించారు. ఇటువంటప్పుడు యిలా భావించేవారికి ఆమె సాహిత్యక్షేత్రమువీడి రాజకీయరంగమున

ప్రవేశించుట అధిక బాధాకరముగా నుండుటలో ఆశ్చర్యము లేదు.

అసలు విషయ మేమంటే, ఆమె జీవితములో కలిగిన దనుకొనే పరివర్తనము పరివర్తనము గాదు. జీవితముయొక్క ముఖ్యప్రవాహము అదే. పైభాగముమాత్రమే మారినది. కవి కల్పనాక్షేత్రమునుండి, కార్యరంగమున ప్రవేశించాడు. కవి అభివృద్ధిగాంచి ప్రజాసమూహములో కలసిపోయాడు. ఆత్మార్పణము వ్యష్టినుండి సమష్టివరకు వ్యాపించింది. యావన్ స్త్రీ మాత యైనది. మాతృత్వముయొక్క భావన భోగాన్ని శిథిలం చేసింది. జీవితం అసంఖ్యాకమైన సంతానములో వ్యాపించింది.

సరోజినీదేవిలో కవితాశక్తి నశించినదనుట పొరపాటు. కవిసమాధినుండి రాజకీయవేత్త అవతరించా డనటం అంతకంటే పొరపాటు. కవి నశించక, వికసించాడు. స్వీయబంధనాలను, హద్దులను అతిక్రమించి బయటపడ్డాడు. కావ్యము రచనాబద్ధముగాక, కోటానుకోట్ల దుఃఖ దరిద్ర పీడిత ప్రజాసేవలో చెప్పబడుతూవచ్చింది. ♦ కావ్యక్షేత్రమును యెందుకు వీడావని ఆమెను కొంతమంది ప్రశ్నించినప్పుడు ఆమె యిలా చెప్పింది.*

---

♦ ఆమె సెల్‌బోర్న్ కమిటి ఎదుట ఇచ్చిన సాక్ష్యాన్ని సెలబోర్న్ యిట్లు ప్రశంసించాడు.

"If I may be allowed to say so, it illuminates our prosaic literature with a poetic touch."

* 1918 లో కంజీవరములో జరిగిన మద్రాసు రాజకీయ మహాసభ అధ్యక్షోపన్యాసములోని భాగము —

" Often and often have they said to me — 'Why have you come out of ivory tower of dreams to the market place? Why have you deserted the pipes and flutes of the poet to be the most strident trumpet of those who stand and call the nation to battle?' Because the function of a poet is not merely to be isolated in ivory towers of dreams set in a garden of roses, but his place is with the people, in the dust of the high ways, in the difficulties of the battle is the poet's destiny. The one reason why he is a poet is that in the hour of danger, in the hour of defeat and despair, the poet should say to the dreamer — if you dream true, all difficulties, all illusions, all despairs are, but 'Maya'; the one thing that matters is hope. Here I stand before you with your higher dreams, your invincible courage, your indomitable victories. Therefore today in the hour of struggle, when in your hands it lies to win victory for India, I, a weak woman, have come out of my home, a dreamer of dreams have come into the market place, and I say — " Go forth, comrades to victory."

"నన్ను కొందరు పదేపదే అడుగుతూ వచ్చారు. 'నీ కవితాస్వప్నాన్నుంచి ఈ రాజకీయ అంగడిలో కెందుకొచ్చావు? కవయిత్రివిగా నీవు వినిపించే ఆ మధుర మురళీ స్వనాలను కట్టిపెట్టి జాతీయ సమరానికి ప్రోత్సహించే ఈ శంఖాన్ని పూరించడానికి ఎందుకు బయలుదేరావు?' అని. నా జవాబిది. "గులాబితోటల మధ్యగా అద్దాల మేడల్లో, కాదు కవి నివసించవలసినది. — అతని స్థానం ప్రజలలో

రోడ్లమీద యెగిరే దుమ్ములో ఉంది. స్వాతంత్ర్య పోరాటాని కడ్డువచ్చే ప్రతిబంధకాలలో కవి భవిష్యత్ ఇమిడివున్నది. అపజయములో నైరాశ్యము అవతరించినప్పుడు, కవి స్వప్న జీవి కిలా చెప్పాలి. నీ స్వప్నం నిజమైతే కష్టాలు, వ్యామోహాలు, నైరాశ్యం, యివన్నీ మాయ అనగా మిధ్య. ఆశ ఒక్కటే సత్యం.”

“మీ స్వప్నాలకు, శౌర్యాలకు, మీ విజయాలకు తోడ్పాటుగా నేను ఇప్పుడు నిలబడినాను. ఈ పరీక్షా సమయములో నేను — ఒక అబలను యిల్లు బయలుదేరివచ్చాను. స్వప్నాలలో స్వప్నా లనుభవించే నేను — ఈ బజారులోకి వచ్చి హెచ్చరిస్తున్నాను. ‘ముందుకు నడవండి. సోదరులారా! ముందుకు నడవండి, విజయసీమను చేరండి’.”

అల్లయినట్లయితే సరోజిని కవిత్వాన్ని వీడి రాజకీయ వేత్త ఎందుకు అయ్యింది అనే ప్రశ్న వుదయించక మానదు.

ఆమె రాజకీయాలలో ప్రవేశించినను ఆమె రాజకీయ వేత్త (Politician) కాదు * ఆమె రాజకీయములలో రాజకీయ వేత్తగా సంచరించనే లేదు. కావ్యసందేశము, మాతృత్వసందేశ మిచ్చుటకే ఆమె అందులో ప్రవేశించింది. రాజకీయాలు వున్నత పథాన వృద్ధి గాంచుటకై ఆమె సహాయపడింది. ఆమెలో

---

* సరోజనీదేవి స్వయముగా అనేకసార్లు తాను రాజకీయవేత్తను కాను అనిస్పష్టపరిచినది. అలహాబాదులో ఒక ఉపన్యాసము ఇస్తూ ఇలా అన్నది ‘నేను స్త్రీనగుటచే నా స్త్రీబుద్ధి గహనమైన రాజకీయవిషయాలు గ్రహించజాలదు అని నేను పదేపదే చెబుతూవచ్చాను. నేను సనాతనమైన దేశ ప్రేమసిద్ధాంతాన్నే ఎరుగుదును. తద్వారా భారతమాత సేవజేస్తూ ఆమె గౌరవాన్ని కాపాడుతూ, ఐశ్వర్యాభివృద్ధులకు ప్రయత్నించుట అవసరమని కృషి చేస్తున్నాను.’

జాతీయాభిమానంకంటే దేశాభిమానం అధికము. విశాలమైన ఆమె దేశభక్తికి కారణం రాజకీయం గాదు. అసంఖ్యాకమగు సంతానము అనుభవించే శోకవిచారములు చూడజాలకపోవుటయే కారణము. ఇది మాతృత్వముయొక్క సంపూర్ణాత్మార్పణ-వేదన. ఇందువలననే ఆమె మాటలు దేశప్రీతివాక్కు కావ్యభావగానే వచ్చింది. పరిస్థితులుకాని, రాజకీయాలుకాని ఆమె హృదయమృదుతరంగ ఆవేగాలను, ఈమనస్మా్త్రమయము శిథిలపరచజాలకపోయినవి. ఆమె వాణి తుదివరకు నవజీవనదాయియైన ప్రాతఃకాలవాయుసందేశమువలె నవనవోన్మేషమై వుంటూ వచ్చింది.

1929 సం॥ లో అమెరికాలో ఆమె చేసిన ప్రసంగం స్వయంగా భారతమాతయే అమెరికాకు సందేశమిచ్చినట్లు మాతృవేదనా సంభరితమై యుండెను. ఆమె రాజకీయాలను మధించి అందలి విషాన్ని పదదళితమొనర్చినది. వీటన్నిటికి కారణము ఆమె విశాలమాతృహృదయమే. ఇందువలన ఆమె నారీజీవితముయొక్క సాఫల్యతయెచ్చటనున్నదో దాని అమరతాప్రవాహము యేవిధంగా అక్షయంగా వుంచనగునో తెలుసుకొన్నది. గౌరవశిఖరాగ్రభాగములనుండి ఆమె స్వీయసంతానానికి సందేశసమ్మిళిత సానునయవాక్యాలు పలికినది. ఈ మాతృబోధల కారణంవల్లనే మహిళోద్యమంలో మార్గదర్శినియైకూడా, ఆధునికస్త్రీల స్వేచ్ఛావిహారానికి ఆమె బద్ధవిరోధిని. వైభవవాతావరణంలో ఆమె పుట్టిపెరిగినా, సౌందర్యస్వప్నసీమలలో విహరించినా, కవికాల్పనికరాజ్యములో రాణియైనా, ఆమెలో భారతమహిళోద్యమనాయకురాండ్రలోగల

కర్తృత్వ మిసుమంతయు లేదు. భారత కాంగ్రెసు అగ్ర నాయకులలో, యేపక్షానికి చెందక, సంకుచితత్వము లేక, సదా సర్వోపరిభాగమున నుండగలిగిన ఉత్తమసంస్కారిణి. ఆమె జీవితములోని ప్రతిఅడుగు సామరస్యపరిపూర్ణసమ్మిళిత మైనదే. ఎట్టి పరిస్థితిలోను ఆమె రాజమార్గాన్ని వీడలేదు. ఆమెసందేశము ఉన్నతమైనదే.

ఆమె ఒకానొక సమయమున యిలా అన్నది. (I am of a tribute of Beauty) నేను సౌందర్యోపాసనా వర్గము నకు చెందినదానను * ఆమె కఠినమైన రాజకీయ రంగములో వుంటూకూడా, తన ధ్యేయాన్ని కాపాడుకుంటూనేవచ్చింది.

చాలాకాలంక్రితం ఆమె తన జీవిత ఆదర్శాన్ని స్వీయ రచనలో యిలా ప్రకటించింది.

"Into the strife of the throng and tumult
The war of sweet love against folly and wrong
Where brave hearts carry the sword of battle
'T is mine to carry the bannar of song;
The solace of faith to the lips that falter.
The succour of hope to the hands that fail
The tidings of joy when peace shall triumph
When truth shall conquer and love prevail.

"విశ్వకోలాహల సంఘర్షణలలో అజ్ఞాన, అనౌచిత్యాలకు వ్యతిరేకంగా, మధురప్రేమలకు, ఎచట యుద్ధము జరుగుచున్నదో, యెచ్చట వీరపురుషులు ఆయుద్ధరంగమునకు

---

* సౌందర్యాకర్షణ యెటువంటిదని ఆమె నొకరు ప్రశ్నించగా "అది స్త్రీలో ఒకవిధమైన వికాసం" అని నిర్వచించింది.

ఖడ్గధారులై పోవుదురో, అప్పటికి గీతాపతాకాన్ని తీసుకొని పోవుట నాకర్తవ్యము. కంపిత, విచలిత, అధరాలకు విశ్వాసజనితమగు ఆశ్వాసనను సమకూర్చుట, అసహాయులకు, దుర్బలులకు సహాయమొసర్చుట నావిధి. శాంతిజయించి సత్యము ప్రచలితమై ప్రేమ విస్తరించువరకు, ఆనందసందేశము నందించుటయే నావిధ్యుక్తధర్మము *

గాంధీజీ ప్రారంభించిన పోరాటము బ్రిటిషు ప్రభుత్వముపై సాగించిన రాజకీయపోరాటంగా భావించుట సమంజసం కాదు. ఆయన ఈ పోరాటాన్ని యిలా నిర్వచించాడు. "ఇప్పుడు జరుగుచున్న పోరాటం మతమునకునూ కుమతమునకునూ, అంధకారమునకునూ జ్యోతిస్వరూపమునకునూ అని యెరుంగుదురుగాక." భూతకాలమున జరిగిన సంగ్రామములు శత్రునాశనమునకు జరిగినవి. ఈ సత్యాగ్రహయుద్ధము, శత్రుత్వనాశనమునకుమాత్రమే. అందుచేతనే, అది సత్యాగ్రహయుద్ధమైనది. ఈ అహింసాత్మక యుద్ధములో ఆమె ఉత్సాహజ కమైన వుద్ఘాటనలు ఛందోబద్ధముగా చేయకపోవచ్చును. ఆమె ప్రసంగాలలో కావ్యానందము ఓతప్రోత

---

* ఈ గీతభావాన్నే ఆమె ఒక ఉపన్యాసములో ఇలా చెప్పినది.

"Come my General! come my soldiers! I am only a woman, only a poet. But as a woman I give you the weapons of faith and courage and the shield of fortitude. And as a poet, I fling out the banner of song and sound, the bugle call to battle. How shall I kindle the flame which shall waken you men from slavery!"

ముగా నిండియేవున్నది. ఆమె రాజకీయ రంగములో ప్రవేశించి నప్పటికినీ ఆమె అమరకవితాదర్శములను విడనాడలేదు. స్త్రీ జనసహజ విలసితమైన మధుర మాతృభావమును త్యజించ లేదు.

"స్వాతంత్ర్యం సమభావం
సౌభ్రాత్రం సౌహార్దం
పునాదులై యిళ్లు లేచి
జనావళి శుభం పూచి
శాంతి శాంతి శాంతి శాంతి
జగమంతా జయిస్తుంది."

శ్రీ-శ్రీ-.

## జీవిత చరిత్రలు

ఆచార్యరంగా [illegible]
మనవైతుపెద్ద ,,
ప్రజానాయకుడు ప్రకాశం ,,
సర్దార్ వల్లభాయిపటేల్ ,,
కవిరాజు ,,
ఆచార్య కృపలానీ కామేశ్వరరావు
వినాయక సావర్కార్ జగన్నశాస్త్రి